ఉత్తమ ఇస్లామీయ సాహిత్య విలువలతో, ప్రామాణిక విషయ సంపుటితో వెలువడుతున్న

మాస పత్రిక

# పైగామ్ ఎ హిదాయత్

## (దైవ సందేశం)


| VOLUME 3 | ISSUE 6 | JUNE 2015 |
|---|---|---|



సంపాదకులు

**ముహమ్మద్ ఉమర్ ఫారూఖ్**

పర్యవేక్షకులు

మౌలానా **ముహమ్మద్ అబ్దుల్ ఖవీ** సాహబ్

**నాజిమ్, ఇదారా అష్రఫుల్ ఉలూమ్**



మెంబర్‌షిప్ రుసుము వివరాలు

సంచిక వెల - రూ 20/- సంవత్సర రుసుము - రూ 200/-

ఎకౌంట్ పేరు: MOHD ABDUL QAVI, ఎకౌంట్ నెంబర్: 035210011034204

బ్యాంక్ మరియు బ్రాంచ్: ANDHRA BANK, MALAKPET BRANCH

నేను, ముహమ్మద్ అబ్దుల్ ఖవీ, ప్రింట్ లైన్ ప్రింటర్స్ నుండి ఈ పత్రికను ముద్రించి ఇదారా అష్రఫుల్ ఉలూమ్ ట్రస్ట్, హైదరాబాదు తరుపున ప్రవేశ పెడుతున్నాను.

Published at:17-1-391/2/79/A, Khaja Bagh Colony, Saidabad, Hyderabad - 500059.

Phone: 040-24070681 Fax: 040-24071131: 9030557865

www.idara.info E-mail: paigamehidayath@yahoo.com

## విషయసూచిక

**రమజాన్ మాసము దృష్ట్యా ఈ సంచికలో వ్యాసాలన్నీ రమజాన్‌కు సంబంధించినవే ప్రచురించబడుతున్నాయి.**



**ఉత్తర ప్రత్యుత్తరాల కోసం సంప్రదించండి**

ముహమ్మద్ ఉమర్ ఫారూఖ్, 17-1-391/2/79/, ఖాజాబాగ్ కాలనీ,
సయీదాబాద్, హైద్రాబాద్-500059.
ఫోన్: 040-24070681, 9030557865

♦ పాఠకులు నిరంతర సేవల కోసం తమ మెంబర్‌షిప్ వ్యవధి పూర్తి అయిన వెంటనే రుసుము మనీ ఆర్డర్ ద్వారా మాకు పంపగలరు లేదా మా బ్యాంక్ అకౌంట్‌లో డిపాజిట్ చేయగలరు. మీ మెంబర్‌షిప్ వివరాలు మీ సంచిక పై అతికించబడిన మీ అడ్రస్ పై లైన్ లో వుంటుంది.

♦ ఇస్లాం మతానికి సంబంధించిన ఎటువంటి సందేహాలకైననూ మరియు మన జీవితానికి సంబంధించిన విషయాలపై సందేహాలను రాత పూర్వకంగానైనా లేక ఫోన్ ద్వారా అయినా అడిగి తెలుసుకోవచ్చు. ఫోన్ నంబర్లు: 9030557865, 9848097866, 7702234385.

ఖుర్ఆన్ సందేశం



సూరయే బఖర: 183

# ఉపవాసాలు ఎందుకు?

**"ఓ విశ్వాసులారా! మీలో దైవభీతి పెంపొందాలని మీ పూర్వీకులలానే మీపై ఉపవాసములు విధిగావించడమైనది".**

– సూరయే బఖర: 183

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్ بِسۡمِ اللّٰهِ الرَّحۡمٰنِ الرَّحِيۡمِ

﴿١٨٣﴾ يَاأَيُّهَا الَّذِينَ آمَنُوا كُتِبَ عَلَيْكُمُ الصِّيَامُ كَمَا كُتِبَ عَلَى الَّذِينَ مِنْ قَبْلِكُمْ لَعَلَّكُمْ تَتَّقُونَ

యా అయ్యుహల్లజీన ఆమనూ కుతిబ అలైకుముస్ సియాము కమా కుతిబ అలల్ లజీన మిన్ ఖబ్‌లికుమ్ లఅల్లకుమ్ తత్తఖూన్

**యా:** ఓ; **అయ్యుహల్లజీన ఆమనూ:** విశ్వసించిన వారు; **కుతిభ:** విధిగావించడమైనది; **అలైకుమ్:** మీ పై; **అస్సియామ్:** ఉపవాసములు; **కమా:** ఏ విధంగానైతే; **కుతిబ:** విధిగావించబడ్డాయో; **అలల్లజీన:** వారిపై; **మిన్ కబ్లికుమ్:** మీ కంటే ముందున్న; **లఅల్లకుమ్:** బహుశ మీరు; **తత్తకూన్:** దైవభీతిపరులౌతారని.

ఓ విశ్వాసులారా ! మీలో దైవభీతి పెంపొందాలని మీ పూర్వీకులలానే మీకు కూడా ఉపవాసము విధిగావించడమైనది.

అల్లాహ్ ఏకత్వం, దైవదౌత్యం తరువాత, నమాజ్, జకాత్, రోజాలు ఇస్లామ్ మౌలిక సూత్రాలు. ఈ ఐదిటిని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ వారు ఇస్లాం మౌలిక సూత్రాలని, పునాది రాళ్ళని ప్రవచించారు.

రోజాకు సంబంధించి దాని ప్రత్యేకతలు, శ్రేష్ఠతలు, దాని ప్రభావాలు పవిత్ర ఖుర్ఆన్‌లో చాలా స్పష్టంగా, వివరణాత్మకంగా పేర్కొనడం జరిగింది. సూరే బఖరకు చెందిన పై వచనంలో రమజాన్ రోజాలను విధిగా ప్రకటించిన వెంటనే "లఅల్లకుమ్ తత్తకూన్" అని సెలవీయడం జరిగింది. అంటే ఈ ఆదేశం యొక్క అసలు ఉద్దేశ్యం "మీలో భయభక్తులు జన్మింపజేయడం" అని అర్థం.

అల్లాహ్ మానవుడ్ని మానవత్వం, పశుతనం, దైవదూతల గుణం, దానవ గుణాలతో రూపొందించాడు. అతని నైజంలో, స్వభావంలో ఇతర ప్రాణులకు లాగానే సమస్త భౌతిక, అభౌతిక అవసరాలు కూడా ఉన్నాయి. అయితే వీటితోపాటు అతని నైజంలో దైవదూతల్లాంటి సుగుణం, మానవత్వం, ఆధాత్మికత్వాల ప్రకాశ మానమైన పారశ్వం కూడా ప్రత్యేకంగా ఉంది. ఇది దైవ దూతల ప్రత్యేక సుగుణ సంపద.

అయితే మానవుడి గొప్పదనం, ప్రత్యేకత, శ్రేష్ఠత ఏమిటంటే, అతనిలో ఉన్నటువంటి ఈ సుగుణ సంపదల కోణం అమానవీయత, దానవత, పశుత్వ లక్షణాలను అణిచివేయగలగాలి. అమానవీయత, పశుత్వ లక్షణ కోణం మానవీయ సుగుణాల పార్శ్వానికి దాసోహమన్నప్పుడే, విధేయించినప్పుడే ఇది సాధ్యం.

రోజా యొక్క అసలు ఉద్దేశం, మానవుడిలోని అమానవీయతా, దానవత్వ కోణాన్ని దైవాదేశపాలనకు నిబద్ధం చేయడం. విశ్వాసం కోరే సమస్త బాధ్యతలను నెరవేర్చేలా విధేయతా భావాన్ని ప్రొద్దిచేయడం. ఎందుకంటే, ఈ విధేయతా భావం నబువ్వత్ (దైవదౌత్యం) షరియత్ (ధర్మశాస్త్రం)ల ప్రధాన లక్ష్యాలల్లో ఒకటి. అందుకే పూర్వ ధర్మశాస్త్రాలన్నిటిలోనూ రోజా పాటించమన్న ఆదేశాలున్నాయి.

ఈ ఉపవాసాలు మానవుడిలోని పశుత్వాన్ని, అమానవీయతలను దూరం చేసి దైవాజ్ఞాబద్ధునిగా చేస్తాయి. మనోవాంఛలను, లైంగికోద్రేకాలను నియంత్రించే సాధనాలుగా ఉపకరిస్తాయి. కష్టనష్టాలను, ఆకలిదప్పికలను సహించే అలవాటును నేర్పుతాయి. అందుకే పూర్వ సమాజాల వారికి కూడా ఉపవాసాలు పాటించమన్న ఆదేశం ఉండేది. ఉపవాస దినాలు, అవి పాటించే పద్ధతుల్లో ఆనాటి సముదాయాల పరిస్థితినిబట్టి వారి అవసరాలనుబట్టి కొంత వ్యత్యాసం ఉండేది.

అయితే, ఈ చివరి సముదాయముపై మాత్రం నెల రోజుల ఉపవాసాలు విధిగా నిర్ణయించబడ్డాయి. ఉషోదయానికి ముందు నుండి, సూర్యాస్తమయం వరకు దీని సమయ నిర్ణయం జరిగింది. ఈ వ్యవధి, ఈ సమయం ఉపవాసాల ఉద్దేశ్య పరిపూర్తికి నేటి కాలానుగుణంగా ఎంతైనా సమంజసం, సముచితం, సమతూల్యం, సమగ్రం అనడంలో ఎంతమాత్రం సందేహం లేదు. ఇంతకంటే తక్కువ సమయంలో హృదయ ప్రక్షకాళన, మానసిక సంస్కరణ జరిగే అవకాశాలు లేవు. ఒక వేళ ఇంత కంటే ఎక్కువ సమయం – అంటే, పగలుతో పాటు రాత్రిపూట కూడా ఉపవాసము పాటించమని, కేవలం సహ్రీ సమయంలోనే భుజించాలని, లేక సంవత్సరంలో రెండు, మూడు నెలలు పాటు ఉపవాసాలు పాటించమని ఆదేశించినట్లైతే, అత్యధిక శాతం మంది ప్రజలు వ్రతం పాటించలేక దూరంగా ఉండిపోతారు. అంతేగాక అది ఆరోగ్యానికి కూడా అత్యంత నష్టదాయకంగా పరిణమిస్తుంది.

కనుక సంవత్సర కాలంలో కేవలం నెలరోజుల పాటు, సూర్యోదయానికి ముందు నుండి, సూర్యాస్తమయం వరకు ఉపవాసం పాటించడం, నేటి మానవుల పరిస్థితుల పరంగా, వారి

శిక్షణ, సంస్కరణల ఉద్దేశం నెరవేరడానికి ఓ చక్కని సమగ్రమైన, సముతూల్యమైన ఏర్పాటు.

ఈ ఉద్దేశ్య పరిపూర్తికి ఎమచుకున్న మాసం కూడా విశిష్టమైనదే. అది పవిత్ర ఖుర్ఆన్ అవతరించిన మాసం. ఈ మాసంలో ఎన్నో శుభాలు, కారుణ్యసమగ్రహాలు వర్షించే ఒక రాత్రి ఉంది. (లైలతుల్ ఖదర్). ఈ మాసంలో పగటిపూట ఉపవాసాలు పాటించడంతో పాటు తరావీహ్ పేరిట ఒక ప్రత్యేకమైన సామూహిక ఆరాధన కూడా ఈ సముదాయంలో చెలామణిలో ఉంది. పగటి రోజాలతో పాటు రాత్రి తరావీహ్‌ల శుభాలు లభించడం వల్ల ఈ పవిత్ర మాసంలోని దివ్య తేజస్సు, పవిత్ర ప్రభావాలలో ద్విగుణీకృత వృద్ధి వికాసాలు కలుగుతాయి. ఈ విషయాల పట్ల ఏమాత్రం సంబంధం కలిగిన దాసుడైనా ఈ అనుభూతిని తప్పకుండా అనుభవించగలుగుతాడు.

ఇక్కడ ఉపవాసం పాటించడం వల్ల కలిగే ప్రయోజనాలలో అతి ముఖ్యమైన దానిని మాత్రమే ప్రస్తావించడం జరిగింది. (ఉపవాసం ద్వారా తక్వా వస్తుంది, అది ఇహపర లోకాల సాఫల్యాన్ని చేకూరుస్తుంది.) ఇదే కాకుండా ఉపవాసం వల్ల ఎన్నో ధార్మిక, లౌకిక ప్రయోజనాలు కూడా ఉన్నాయి. వాటన్నిటినీ ఇక్కడ ప్రస్తావించడం అసంభవం. ధార్మిక పరంగా అతి ముఖ్యమైన ప్రయోజనాన్ని చూశాము. మరి లౌకిక పరంగానూ ఒక ముఖ్యమైన ప్రయోజనాన్ని చూద్దాం.

దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఒక సందర్భములో ఇలా ఉపదేశించారు:

"వ సూమూ తసిహ్హూ" ఉపవాసము ఉండండి, మీరు ఆరోగ్యంగా ఉంటారు.

1400 సంవర్సరాల క్రితం దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ప్రవచించిన ఈ మాట ముమ్మాటికి నిజమని నేడు రుజువైంది. ఎంతో మంది ప్రముఖ శాస్త్రవేత్తలు, డాక్టర్లు దీన్ని ధృవీకరించారు. డాక్టర్ జ్యాక్ గోల్డ్‌స్టెన్ వ్రాసిన 'Triumph over disease by fasting and natural diet' "ఉపవాసము మరియు సహజ ఆహారము ద్వారా వ్యాధుల పై విజయం" అనే పుస్తకంలో దీని ప్రయోజనాలను చూడగలరు. వారి పరిశోధన ప్రకారం 1. ఉపవాసము వల్ల 'vital organs' ప్రాణాధారమైన అవయవాలకు పూర్తి విశ్రాంతి లభిస్తుంది, 2. 'metabolic wastes' జీవక్రియ వ్యర్థాలను తొలగించడంలో దోహదపడుతోంది, 3. జీవ రాసాయన స్రావాల సర్దుబాటులో సాయపడుతోంది, 4. 'cells' కణాలు 'tissues' కణజాలలకు కొత్త జీవనాన్నిస్తుంది, 5. జీర్ణ శక్తిని పెంచుతుంది, జీర్ణాసయము సక్రమంగా పనిచేయడంలో మద్దత్తి ఇస్తుంది, 6. ఎనర్జీ ఉత్పత్తి, పరిరక్షణలో దోహద పడుతుంది. 7. కొవ్వు, వ్యాధిగ్రస్తులైన కణజాలాలను మరియు ఇతర అనవసరపు పదర్థాలను తొలగిస్తుంది. ఇవన్నీ నేటి శాస్త్రవేత్తలు ఎన్నో పరిశోధనాల తరువాత గ్రహించిన ఫలితాలు. ఇంకా వారు గ్రహించనివి ఎన్ని ఉన్నాయో అల్లాహ్‌కే తెలుసు...!

**రమజాన్ విలువేమిటో తెలిస్తే నా ఉమ్మత్ (సంతతివారందరూ) సంవత్సరం మొత్తం రమజాన్ మాసమే ఉంటే బాగుండునని ఆశపడేవారు.**




రమజాన్‌లో అల్లాహ్‌ను “స్తుతించేవాడు” క్షమించబడతాడు. అల్లాహ్‌ను “వేడుకునేవాడు” నిరాశచెందడు.

హజ్రత్ అబూహురైరా రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఇలా సెలవిచ్చారు: రమజాన్ వస్తూనే స్వర్గ ద్వారాలు తెరవబడతాయి, నరక ద్వారాలు మూసివేయబడతాయి. షైతానులు బంధించబడతారు. (మరొక హదీసులో స్వర్గ ద్వారాలకు బదులు కారుణ్య ద్వారాలు అని ఉంది). (బుఖారీ; ముస్లిం)

**సంగ్రహణం:**

హజ్రత్ షాహ్ వలియుల్లాహ్ రహ్మతుల్లాహి అలైహ్ గారు తమ “హుజ్జతుల్లాహిల్ బాలిగహ్” లో ఈ హదీసును వ్యాఖ్యానిస్తూ రాసిన సారంశం ఇలా ఉంది:

సచ్ఛీలురు, సత్కార్యాభిలాషులైన అల్లాహ్ దాసులు రమజాన్ మాసంలో ఆరాధనలు, దైవ విధేయతలో నిమగ్నమైపోతారు. పగలంతా ఉపవాసాలు పాటిస్తూ, దైవగ్రంధ పారాయణంలో గడుపుతారు. రాత్రిలోని ఓ పెద్ద భాగం తరావీహ్, తహజ్జుద్, దువా, ఇస్తెగ్‌ఫార్‌లలో వెచ్చిస్తారు. ఈ శుభాల ప్రభావం వల్ల సాధారణ విశ్వాసుల హృదయాలు కూడా ఆరాధనలు, సత్కార్యాల వైపు మొగ్గి, చెడులకు దూరంగా ఉంటాయి. ఈ విధంగా ఇస్లాం, ఈమాన్‌ల భాగ్యం పొందిన ప్రజలు దైవభీతి, దైవప్రసన్నత, దైవవిధేయతల మార్గంలో సహజంగానే ముందుకు పోతారు. మానవుల మనసులో ‘మంచి’, ‘సత్కార్యాభిలాష’ అన్నది ఏకొద్దిగ ఉన్నా అది దైవ ప్రసన్నత కోసం తహతహలాడుతుంది. దీంతో ఏ చిన్న సదాచారణ చేసినా ఈ పవిత్ర మాసంలో అనేక రెట్లు అధికంగా ప్రసాదించడుతుంది. ఇతర మాసాలతో పోల్చుకుంటే ఈ మాసం సదాచారాల విలువ అత్యంత అధికం. వీటన్నిటి ఫలితంగా ఇలాంటి వారి కోసం స్వర్గ ద్వారాలు తెరుచు కుంటాయి. నరక ద్వారాలు మూసుకుపోతాయి. వీరిని అపమార్గం పట్టించడం షైతాను వల్ల కాని పని. దుష్కార్యాలను ప్రేరేపించలేనప్పుడు షైతానులు బంధించబడినట్లే.

ఈ వ్యాఖ్యానం ప్రకారం ఈ మూడు విషయాల సంబంధం (1. స్వర్గం/కారుణ్య ద్వారాలు తెరుచుకోవడం, 2. నరక ద్వారాలు మూసుకుపోవడం, 3. షైతానులు బంధించబడడం) కేవలం రమజాన్ మాసంలో సదాచరణల వైపు మొగ్గి, మనసు లగ్నం చేసి, ఈ మాసం కారుణ్యం, శుభాల ద్వారా ప్రయోజనం పొందటానికి ఆరాధనల్లో లీనమైన వారితోనే ఉంటుంది.

రమజాన్, రమజాన్ ఆదేశాలు, శుభాలను పట్టించుకోకుండా, నిర్లక్ష్యం వహించే దైవ తిరస్కారులకు, ఈ విధమైనటువంటి శుభాలు, శుభవార్తలతో ఎలంటి సంబంధము లేదు. పవిత్ర రమజాన్ వచ్చిన తరువాత కూడా జీవితాల్లో ఏమాత్రం మార్పు లేకుండా సంవత్సరంలో 12 నెలలు షైతాన్ అనుసరణలోనే సంతృప్తిచెందే వారికి దైవం కూడా పరాభవాన్నే మిగుల్చుతాడు.

హ|జ్రత్ అబూహురైరహ్ రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనం ప్రకారం, దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఇలా సెలవిచ్చారు:

“రమజాన్ మొదటి రాత్రిన షైతానులు, తలబిరుసు జిన్నాతులు బంధించబడతారు. నరక ద్వారాలన్నీ మూసివేయబడతాయి. అందులో ఏ ద్వారము తెరిచి ఉండదు. అలాగే స్వర్గ ద్వారాలన్నీ తెరిచి ఉంటాయి. వాటిలో ఏ ద్వారమూ మూసివేయబడదు.

అల్లాహ్ తరపున ఒక ప్రకటన కర్త “మంచిని, మేలును కాంక్షించేవాడా ! ముందుకు రా ! చెడును కోరుకునేవాడా ! ఆగిపో !” అని ప్రకటిస్తాడు. ఎంతో మంది (పాపాత్ములు) దాసులకు అల్లాహ్ తరపున నరకాగ్ని నుండి విముక్తి లభిస్తుంది. ఈ విధంగా రమజాన్ లోని ప్రతి రాత్రి ఇలాగే జరుతూ ఉంటుంది. (తిర్మిజీ, నసయీ, ఇబ్నె మాజహ్).

**సంగ్రహణం:**

ఈ హదీసు మొదటి భాగంలో చెప్పబడిన విషయం, ఇంతకు ముందు హదీసులో కూడా చెప్పడం జరిగింది. అయితే చివరిలో అల్లాహ్ తరపున ఒక ప్రకటన కర్త ఓ బహిరంగ ప్రకటన చేస్తాడన్న విషయం ఉంది. దాన్ని మనం మన చెవుల ద్వారా వినలేము. కాని ఈ ప్రపంచంలో దాని ప్రభావం పడుతున్నట్లు మాత్రం మనం చూస్తున్నాము. సాధారణంగా రమజాన్ మాసంలో దైవ విశ్వాసులు సత్కార్యాలు, సదాచరణల వైపు అత్యధిక శ్రద్ధ కనబర్చడమే దీనికి నిదర్శనం. మరో బొత్తిగా నిర్లక్ష్య జీవితం గడిపే ముస్లింలు సైతం రమజాన్ లో తమ వైఖరిని కాస్తయినా మార్చుకుంటారు. మా దృష్టిలో ఇది అల్లాహ్ తరపున నియుక్తుడైన అగోచర ప్రకటన కర్త నినాద ప్రభావమే.

హ|జ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నే అబ్బాస్ రజియల్లాహు అన్హు గారు ఇలా ఉల్లేఖించారు:

“దైవ ప్రవక్త సల్లలల్లాహు అలైహి వసల్లనమ్ క్షమాగుణంలో, దైవ సృష్టికి ప్రయోజనం చేకూర్చే విషయంలో మానవులందరికంటే ముందంజలో, ఉన్నత స్థానంలో ఉన్నారు. రమజాన్ లో ఆయనలోని ఈ కారుణ్య గుణం మరింత వృద్ధి చెందేది. రమజాన్ లోని ప్రతి రాత్రి జిబ్రయీల్ అలైహిస్సలామ్ ఆయనను కలుసుకునేవారు. ప్రవక్త మహనీయులు ఆయనకు దివ్య ఖుర్ఆన్ వినిపించేవారు. ఇలా ప్రతి రోజూ జిబ్రయీల్ అలైహిస్సలామ్ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారిని కలుసుకుంటున్నప్పుడు ఆయనలోని కారుణ్యగుణం, క్షమాగుణం, అల్లాహ్ పంపిన వాయువేగాన్ని అదిగమించేవి. (బుఖారీ; ముస్లిం)

**సంగ్రహాణం:**

అంటే, రమజాన్ మాసం దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ లోని కారుణ్యం, క్షమా, జాలి, దయ, ప్రేమ, త్యాగం, సహనం, ఆనందం లాంటి అనేక సద్గుణాలను ఇంకా వృద్ధి చేసే మాసం అన్నమాట. ఇందులోని ప్రతి రాత్రికి ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ వారు ప్రత్యేక దూత జిబ్రయీల్ గారికి ఖుర్ఆన్ వినిపించడంతో కూడా సంబంధం ఉంది.

**రమజాన్ సందర్భంగా ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి ప్రసంగం:**

హజ్రత్ సల్మాన్ ఫార్సీ రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనం ప్రకారం, షాబాన్ మాసం చివరి తేదీన దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ మాకిలా ఉపదేశించారు:

"ప్రజలారా ! ఒక మహత్తరమైన, శుభప్రదమైన మాసం తన ఛాయను మీపై కప్పబోతోంది. ఆ పవిత్ర మాసంలో ఒక రాత్రి (షబే ఖదర్) 1000 మాసాల కన్నా శ్రేష్ఠమైనది. ఆ మాసం ఉపవాసాలను అల్లాహ్ మీకు విధిగా చేశాడు. ఆ రాత్రుల్లో అల్లాహ్ సన్నిధిలో ఆరాధన (తరావీహ్ నమాజు) చేయడం నఫిల్‌గా నిర్ణయించాడు. ఎవరైతే ఆ మాసంలో దైవ ప్రసన్నత, ఆయన సామీప్యం పొందడానికి విధి కానటువంటి ఒక ఆరాధన (అంటే సున్నత్‌గాని, నఫిల్‌గాని) చేసినట్లైతే అది ఇతర దినాల్లో విధిగా చేయవలసిన ఆరాధనతో సమానంగా పుణ్యఫలం లభిస్తుంది. అలాగే ఈ మాసంలో ఒక విధిని నెరవేరిస్తే ఇతర కాలంలో 70 విధులు నిర్వహించిన దనితో సమానంగా పుణ్యం లభిస్తుంది.

ఇది సహనం వహీమచవలసిన మాసం, సహనానికి ప్రతిఫలం స్వర్గం లభిస్తుంది. ఇది సానుభూతి చూపవలసిన మాసం. ఈ మాసంలో విశ్వాసుల ఉపాధి వృద్ధి చేయబడుతుంది. ఎవరైనా ఈ మాసంలో (దైవప్రసన్నత, పుణ్యఫలాపేక్షతో) ఒక ఉపవాసికి ఇఫ్తార్ చేయిస్తే అతని పాపాలు క్షమించబడతాయి. నరకాగ్ని నుండి విముక్తి లభిస్తుంది. అతనికి ఉపవాసం ఉన్న వారితో సమానంగా పుణ్యము కూడా లభిస్తుంది. అయితే ఉపవాసము పాటించే వ్యక్తి పుణ్యఫలంలో ఏమాత్రం కొరత కలగదు.

అప్పుడు ప్రజలు, "దైవ ప్రవక్తా ! మాలో ప్రతి ఒక్కరికీ ఇఫ్తార్ చేయించేటంత స్థోమత లేకపోతేనో?" (పేదవాళ్ళు ఇంత గొప్ప పుణ్యానికి దూరమైపోతారు కాదా?) అని ప్రశ్నించారు.

దానికి దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహివసల్లమ్ ఇలా జవాబిచ్చారు: "కొద్ది మజ్జిగతో లేక కేవలం ఒక గుక్క నీటితో ఇఫ్తార్ చేయించినా, దైవం అతనికి కూడా అంతే పుణ్యం ప్రసాదిస్తాడు".

(దైవ ప్రవక్త సల్లల్దాలహు అలైహి వసల్లమ్ గారు తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఇలా అన్నారు) ఎవరైనా ఒక ఉపవాసికి కడుపునిండా భోజనం పెడితే, అతనికి అల్లాహ్ నా హౌజ్ (హౌజే కౌసర్) నుండి తనివితీరా తాపిస్తాడు. తరువాత ఇక అతనికి స్వర్గంలోకి ప్రవేశించేంతవరకు దాహం వేయదు.

తరువాత ఆయన ఇలా అన్నారు: ఈ మాసంలో మొదటి భాగం కారుణ్యం, మధ&ఉ భాగం క్షమాపణ, చివరి భాగం నరకాగ్ని నుండి విముక్తి. ఎవరైతే ఈ మాసంలో తమ సేవకుల పని

భారాన్ని తగ్గిస్తారో, అల్లాహ్ వారిని క్షమిస్తాడు. వారికి నరకాగ్ని నుండి విముక్తిని ప్రసాదిస్తాడు. (బైహఖీ ఫీ షుఅబిల్ ఈమాన్)

**సంగ్రహణం:**

ప్రవక్త మహనీయుల వారి ఈ ప్రసంగ పరమార్థం మనకు చాలా స్పష్టంగా అర్థమౌతుంది. అయినప్పటికి మరింత వివరణ కోసం కొద్దిపాటి వ్యాఖ్యానం మీ ముందుంచుతున్నాము.

1. ఈ ప్రసంగంలో పవిత్ర రమజాన్ యొక్క ఘనతను, శుభాలను, ఔన్నత్యాన్ని ప్రస్తుతిస్తూ, మొట్టమొదటి శుభంగా, మొట్టమొదటి ఘనతగా ఒక రాత్రిని పేర్కొనడం జరిగింది. ఆ రాత్రి వెయ్యి రాత్రులు కాదు, వెయ్యి మాసాలకన్నా ఘనమైన రాత్రి అని చెప్పబడింది. ఈ విషయం పవిత్ర ఖుర్ఆన్ లోని సూరే ఖదర్ లో కూడా సెలవీయబడింది. అంతేకాదు, పూర్తి సూరాయే ఈ పవిత్ర రేయి శ్రేష్ఠత, ఔన్నత్యం, శుభాల ప్రస్తావనతో నిండి ఉంది. ఈ రేయి ఘనతను, విలువను అర్థం చేసుకోవడానికి ఈ ఒక్క ఉదాహరణే చాలు.

పోతే వెయ్యి మాసాలలో దాదాపు 30 వేల రాత్రులు ఉంటాయి. "లైలతుల్ ఖదర్" 1000 మాసాలకంటే విలువైన రాత్రి అంటే, అల్లాహ్ తో సంబంధం కలిపిన వారు, ఆయన ప్రసన్నతను, సామీప్యాన్ని కోరుకునే దాసులు ఈ ఒక్క రాత్రిలో దైవప్రసన్నతా మార్గంలో ఎంత దూరం దూసుకు వెళతారంటే, ఇతర వేల రాత్రులు ప్రయాణించినా అంత దూరం వెళ్ళలేరు. ఏ విధంగా పూర్వకాలంలో నెలలు, సంవత్సరాలు ప్రయాణించినా చేరుకోలేని గమ్యాన్ని మనమీనాడు విమానాలు, రాకిట్ల ద్వారా రోజులు, గంటలలోనే చేరుకో గలుగుతున్నామో, అదే విధంగా, దైవప్రసన్నత, దైవసామీప్యతల ప్రయాణాన్ని కూడా "లైలతుల్ ఖదర్" లో వేగవంతం చేయడం జరుగుతుంది. వందల సంఖ్యలో మాసాలు గడిచిపోయినా దక్కని మహాభాగ్యం శుభప్రదమైన ఈ ఒక్క రాత్రిలోనే దైవ విశ్వాసులకు ప్రసాదించబడుతుంది.

ఇదేవిధంగా, ఈ పవిత్ర మాసంలో ఒక సున్నత్, లేక నఫిల్ సత్కార్యం ఆచరిస్తే ఫర&ఖీ తో సమానంగా, ఫరజ్ కార్యాన్ని ఆచరిస్తే 70 ఫరజులతో సమానంగా పుణ్యఫలం ప్రసాదించబడుతుందని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ సెలవిచ్చారు. అంటే, లైలతుల్ ఖదర్ ప్రత్యేకత రమజాన్ మాసములోని ఒక ప్రత్యేక రాత్రికి సంబంధించిన ప్రత్యేకత. కాని సత్కార్యాల పుణ్యఫలం 70 రెట్లు లభించడం మాత్రం పవిత్ర రమజాన్ లోని రేయింబవళ్ళ శ్రేష్ఠత, ప్రత్యేకత. అల్లాహ్ తఆలా మనందరికీ ఈ యదార్థాల పట్ల పటిష్ట విశ్వాసం, వీటి ద్వారా ప్రయోజనం పొందే భాగ్యాని ప్రసాదించుగాక !

2. అలాగే ఈ ప్రసంగంలో రమజాన్ మాసాన్ని సహనం, సానుభూతుల మాసం అని పేర్కొనడం జరిగింది. ధార్మిక పరిభాషలో "సబర్" (సహనం) అంటే, 'అల్లాహ్ ప్రసన్నత కోసం తన మనోకాంక్షలను అణిచివేయడం, కష్టాలు, బాధలను సహించడం' అని అర్థం. నిజానికి రోజా ఉద్దేశము కూడా ఇదే. ఈ విధంగా ఉపవాసము పాటించడం వల్ల ఆకలి బాధ అంటే

ఏమిటో స్వయంగా అనుభవంలోకొస్తుంది. తద్వారా వారిలో పేదసాదల పట్ల సానుభూతి, సహకార భావన జన్మిస్తుంది. పట్టెడన్నం కోసం అలమటించే అభాగ్యులను ఏదో రకంగా ఆదుకోవాలని, వారి ఆకలి బాధను తీర్చాలన్న బలమైన కోరిక మనసులో వేళ్ళూనుకుంటుంది. అందుకే రమజాన్ మాసం నిస్సందేహంగా సహనం, సానుభూతుల మాసమే.

3. మరో విషయం ఏమిటంటే, 'ఈ శుభప్రదమైన మాసంలో దైవ విశ్వాసుల ఉపాధిలో వృద్ధి కలుగుతుంది.' అని చెప్పడం జరిగింది. ఇది ఉపవాసము పాటించే దైవ విశ్వాసులందరి స్వానుభవం. రమజాన్ మాసంలో రకరకాల రుచికరమైన వంటలు ఎంత విస్తరంగా లభిస్తాయో, మిగతా 11 నెలల్లో అంతగా ప్రాప్తం కావు. ఇవి ఏవిధంగా సమకూరినా అదంతా అల్లాహ్ ఆజ్ఞతో లభించిన మహాభాగ్యం.

4. ఇక హదీసు చివరిలో .... రమజాన్ మాసంలొ మొదటి దశకం కారుణ్యమని, రెండవ దశకం క్షమాపణ దశకమని, చివరి భాగం నరకాగ్ని నుండి విముక్తి దశకమని ఉపదేశించడం జరిగింది.

అంటే, రమజాన్ శుభాల ద్వారా ప్రయోజనం పొందే దాసులు మూడు రకాల వారుంటారు. వీరిలో సఛ్ఛీలురు, దైవభీతి పరాయణులు మొదటి రకం. వీరు సతతం పాపాలనుండి సురక్షితంగా, పవిత్రంగా ఉండడానికి పూర్తి ప్రయత్నం చేస్తారు. ఒకవేళ పొరపాటుగా ఎప్పుడైనా ఏదైనా తప్పు దొర్లిపోతే, పాపం జరిగిపోతే వెంటనే పశ్చాత్తాపము చెంది, తౌబా చేస్తారు. తమ పాపాన్ని కడిగేసుకుంటారు. ఇలాంటి దాసులపై దైవ కారుణ్యా వర్షం ఈ మసపు మొదటి రాత్రి నుండే ప్రారంభమౌతుంది.

ఇక రెండో వర్గం: వీరు మొదటి వర్గం వారంతటి పరిపూర్ణ దైవభీతి పరులు కానప్పటికీ, మరీ అంత పనికిమాలినవారు మాత్రం కాదు. ఇలాంటివారు రమజాన్ ప్రారంభ దశనుండే నమాజ్, రోజాలతో పాటు ఇతర సత్కార్యాల ద్వారా తమ పరిస్థితిని మెరుగుపరుచుకొని, దైవకారుణ్యానికి, ఆయన క్షమకు అర్హులుగా తయారౌతారు. ఈ విధంగా రమజాన్ రెండవ దశలో దైవం వారిని కూడా కరుణించి, క్షమాపణకు అర్హులుగా ప్రకటిస్తాడు.

ఇకపోతే మూడవ వర్గం: వీరు తమ ఆత్మలకు అన్యాయం చేసుకున్నవారు. తమ దుర్నడత, పాపాలు, దుష్కార్యాల కారణంగా నరకానికి పూర్తి అర్హులైనారు. ఇలాంటి వారు కూడా ఇతరులతో కలసి రమజాన్ ప్రారంభం, మధ్యస్తంలో రోజాలు పాటిస్తూ, తౌబా, ఇస్తెగ్ఫార్ చేస్తూ ఎంతో కొంత తమ పాపాలను కడిగేసుకునే ప్రయత్నం చేస్తారు. ఈ విధంగా రమజాన్ చివరి భాగంలో (ఇది దైవకారుణ్యం అనంతంగా ఉప్పొంగే దశకం) అల్లాహ్ వారిని కూడా క్షమించి, నరకాగ్ని నుండి విముక్తిని ప్రకటిస్తాడు.

వ్యాఖ్యానంలో వివరించిన క్రమాన్నిబట్టి, రమజాన్ మాసంలోని ఈ మూడు దశల సంబంధం, ఈ మూడు వర్గాలవారితో ఉంటుంది.



"నెలవంకను చూసి ఉపవాసాలు ప్రారంభించండి. మళ్ళీ నెలవంకను చూసి ఉపవాసాలు విరమించండి. ఒకవేళ (29వ తేదీన) చంద్రుడు కనిపించకపోతే షాబాన్ నెల 30 రోజుల లెక్క పూర్తిచేయండి."

## రమజాన్ మాసము మొదలైన వెంటనే

1. స్వర్గపు ద్వారాలు తెరవబడతాయి, నరక ద్వారాలు మూసివేయబడతాయి.
2. షైతానులు బంధించబడతారు.
3. ప్రతీ రాత్రి ఓ దైవ దూత ద్వారా ఇలా ప్రకటించబడుతుంది: మంచిని కోరుకునేవారు ముందుకు సాగండి, దురువాంఛలు గలవారు వెనక్కి తగ్గండి.
4. అల్లాహ్ తఆలా ఈ పవిత్ర మాసములో ఎంతో మందికి నరకము నుండి ముక్తిని ప్రసాదిస్తాడు.
5. రమజాన్ మాసపు రాత్రులలో ఒక రాత్రి 1000 నెలల కంటే శ్రేష్ఠమైనది.
6. నఫిల్ కార్యానికి ఫరజ్ కార్యముతో సమానంగా, పరజ్ కార్యానికి 70 ఫరజ్ కార్యాలకు సమానంగా పుణ్యం ప్రసాదించబడుతుంది.
7. రమజాన్ ఓర్పు, సహనాలను ప్రదర్శించాల్సిన మరియు ఇతరుల పట్ల సానుభూతి చూపాల్సిన మాసము.
8. ఈ నెలలో విశ్వాసుల రిజ్‌ఖ్ (ఉపాధి) పెంచబడుతుంది.
9. ఈ నెలలోని మొదటి దశకం (పది రోజులు) "రహ్మత్" అనగా దైవ కారుణ్యం కురిసే దశకం, రెండవ దశకం "మగ్‌ఫిరత్" అనగా పాప క్షమాపణ లభించే దశకం, చివరి దశకం నరకము నుండి విముక్తి ప్రసాదించబడే దశకం.
10. రంజాన్ మాసపు చివరి రాత్రి హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి ఉమ్మత్ (సంతతి) లో నిష్టగా ఉపవాసాలు పాటించినవారికి క్షమాభిక్ష అనుగ్రహించినట్లు ప్రకటించబడుతుంది.
11. ఈ పవిత్ర మాసంలో అల్లాహ్ తఆలా తమ భక్తులపై ప్రత్యేక కరుణ్యాన్ని కురిపిస్తారు, వారిని క్షమిస్తారు, వారి ప్రార్ధనలను ఆలకిస్తారు.
12. ప్రతి రోజు విశ్వాసి ప్రార్ధనల నుంచి కనీసం ఒకటైనా స్వీకరించబడుతుంది.

13. భక్తుల ఉత్సాహాన్ని చూసి అల్లాహ్ చాలా ప్రసన్నులౌతారు. ఫరిష్తాలకు (దూతలకు) వారి ఉత్సాహాన్ని చూపి గర్విస్తారు.

14. ప్రతీ రాత్రి ఒక దూత అల్లాహ్ తరఫున ఈ విధంగా ప్రకటిస్తాడు: మీలో ఎవరైనా తన కోరికలు కోరుకునేవాడు ఉన్నాడా ! నేను అతడి కోరికను తీరుస్తాను, ఎవరైనా పస్చాత్తాపముతో తన పాపక్షమాపణ కోరుకునేవాడున్నాడా? నేను అతడ్ని క్షమిస్తాను !!

15. పవిత్ర గ్రంధాలన్నీ ఇదే మాసములో అవతరింపబడ్డాయి.

## ఉపవాసాల మహిమలు

1. స్వర్గపు 8 ద్వారాలలో ఒకటి "రయ్యాన్". కేవలం ఉపవాసాలు పాటించేవారికే ఇది పరిమితం. వీరు తప్ప ఇంకెవ్వరూ దీని ద్వారా స్వర్గములోకి ప్రవేశించలేరు.

2. ఏ వ్యక్తి అయితే పూర్ణ విశ్వాసముతో, పుణ్యఫలాన్ని మాత్రమే ఆశిస్తూ ఉపవాసాలు పాటిస్తాడో అతడి (చిన్న) పాపాలు క్షమించబడతాయి.

3. 'ఉపవాసము' నరకాగ్ని నుండి కాపాడే రక్షణకవచము.

4. ఉపవాసమున్నవారి నోటి నుండి వచ్చే దురువాసన అల్లాహ్‌కు 'ముష్క్' లాంటి సువాసన కన్నా ప్రియమైనది.

5. ఉపవాసమున్నవారికి రెండు సందర్భాలలో సంతోషము కలుగుతుంది. ఇఫ్తార్ చేసే సమయంలో, ప్రళయదినాన అల్లాహ్ సన్నిధిలోకి వెళ్ళినప్పుడు.

6. ప్రళయదినాన, రోజా అల్లాహ్ తఆలా యెదుట ఉపవాసాలు పాటించిన వారి కొరకు సిఫారసు చేస్తుంది: "నేను ఈ వ్యక్తిని అన్నపానియాల నుండి, తన లైంగింక వాంఛల నుండి దూరంగా వుంచాను. కాబట్టి ఇతని కోసం నేను చేస్తున్న సిఫారసును అంగీకరించండి". అల్లాహ్ తఆలా ఆ రొజు "రోజా" యొక్క సిఫారసును అంగీకరిస్తారు.

7. ఉపవాసాలున్న వారి శ్రేయస్సు కొరకు నీటిలోని చేపలు సైతం ప్రార్థిస్తుంటాయి.

8. అల్లాహ్ యొక్క అర్ష్ (సింహాసనాన్ని) మోసే దూతలకు సైతం తమ ఇబాదత్ (సేవలు/పూజలను) విరమించుకొని ఉపవాసాలున్నవారు చేసే ప్రార్థనలకు ఆమీన్ అని పలకమని ఆదేశమివ్వబడుతుంది.

9. నిష్టగా ఉపవాసాలు పాటించే వారి ప్రార్థనలను అల్లాహ్ రద్దు చేయరు.

10. రమజాన్ తరువాత వచ్చే "షవ్వాల్" మాసంలో మరొక 6 ఉపవాసాలు పాటిస్తే అల్లాహ్ తఆలా సంవత్సరమంతా ఉపవాసాలు ఉన్నంత పుణ్యాన్ని ప్రసాదిస్తారు.

## సహ్‌రీ

1. సహ్‌రీ భుజించేవారిపై అల్లాహ్ తన కరుణను కురిపిస్తాడు.

2. దూతలు వారి శ్రేయస్సు కోసం ప్రార్థిస్తారు.

3. సహ్‌రీ లో శుభము వుంది.
4. విశ్వాసుల మరియు గ్రంధ ప్రజల ఉపవాసాలలో వ్యత్యాసము “సహ్‌రీ”. అనగా ముస్లింలు మాత్రమే సహ్‌రీ చేస్తారు. ఇతరు ఉమ్మతుల వారికి ఈ సాంప్రదాయము లేదు.

## ఇఫ్తార్

1. ఇఫ్తార్ వేళ అయిన వెంటనే ఉపవాస విరమణ చేసే సాంప్రదాయానికి కట్టుబడి ఉన్నంత వరకు వారు శ్రేయస్కర మార్గము పై ఉంటారు.
2. సూర్యుడు అస్తమించిన వెంటనే ఉపవాసాన్ని విరమించేవారు అల్లాహ్ కు ఎంతో ప్రియమైనవారు.
3. ఇఫ్తార్ వేళ ఉపవాసమున్న వారికి అల్లాహ్ తరపున ఒక ప్రత్యేకమైన ఆనందము కలుగుతుంది.
4. ఇఫ్తార్ వేళ కనీసం ఒక దువా తప్పక స్వీకరించబడుతుంది.

## ఇఫ్తార్ చేయించడం

1. ఉపవాసము ఉన్నవారికి లభించినంత పుణ్యం వారికి ఇఫ్తార్ చేయించిన వారికి కూడా అనుగ్రహించబడుతుంది.
2. ఉపవాసమున్న వారి దప్పిక తీర్చిన వారికి ప్రళయ దినాన దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు “కౌసర్” అనే ప్రత్యేక సెలయేరు నీటితో వారి దాహాన్ని తీరుస్తారు. ఆ తరువాత స్వర్గములోకి ప్రవేసించినంత వరకు వారికి దాహం వేయదు.

## కియాముల్ లైల్ (రాత్రి ఆరాధన)

1. రమజాన్ రాత్రులలో దైవారాధన అభిలషనీయం.
2. రమజాన్ రాత్రులు ఆరాధనలో నిమగ్నమై వుండేవారి పాపాలు క్షమించబడతాయి.
3. రమజాన్ రాత్రులలో తరావీహ్ నమాజు సున్నతే ముఅక్కదహ్ (అనగా ప్రత్యేక శ్రద్ధవహించవలసిన సున్నత్)

## షబే ఖదర్ (మహిమగల రాత్రి)

1. షబే ఖదర్ లో పూర్ణ విశ్వాసముతో, పుణ్యఫలాని ఆశిస్తు దైవారాధనలో లీనమైపోయిన వారి పాపాలు క్షమించబడతాయి.
2. షబే ఖదర్ 1000 నెలల కన్నా శ్రేష్ఠమైనది.
3. షబే ఖదర్‌లో దివ్య ఖురాన్, “లౌహే మెహ్‌ఫూజ్” నుండి ఆకాశాలలోనికి అవతరించబడింది.
4. ఈ రాత్రి హజ్రత్ జిబ్రయీల్ అలైహిస్సలామ్ ఇతర దూతలతో ఇహలోకానికి వచ్చి ఆరాధనలో లీనమైన ప్రతి ఒక్కరి శ్రేయస్సు కోసము ప్రార్ధిస్తారు.
5. ఈ రేయి, జిబ్రయీల్ అలైహిస్సలామ్ గారు తమ 100 రెక్కలలో నుండి కేవలం 2

రెక్కలను విప్పి ఉత్తరము నుండి దక్షణం వకరు మొత్తం కప్పివేస్తారు.
6. దైవదూతలు ఆరాధనలో ఉన్నవారితో ముసాఫహా అనగా చేతులు కలుపుతారు, వారి దువాలకు ఆమీన్ పలుకుతారు.
7. అల్లాహ్ తఆలా తన దాసులను కనికరముతో చూస్తారు, వారిని క్షమిస్తారు.
8. ఈ రేయిని ఉపేక్షించరాదని, దాని శుభాలను పొందేందుకు దాని అన్వేషనలో వుండాలని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు తమ అనుచరులకు ఆజ్ఞాపించేవారు.
9. ఈ మహిమగల రేయి యొక్క శుభాలకు దూరమైనవాడు శుభాలన్నిటికీ దూరమైనట్లే అని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు బోధించారు.

## ఏతెకాఫ్

1. దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు జీవితాంతము రమజాన్ మాసపు చివరి దశకంలో ఏతెకాఫ్ చేసేవారు. వారు చనిపోయిన సంవత్సరం రెండు దశకాల ఏతెకాఫ్ చేసారు.
2. ఏతెకాఫ్ చేసేవారు పాపాల నుండి సురక్షితంగా ఉంటారు.
3. మసీదులోనే ఉండిపోవడం వల్ల వారు చేయలేని సత్కార్యాలకు కూడా వారకి పుణ్య ఫలం లభిస్తుంటుంది.
4. కనీసం ఒక్క రోజు దైవ ప్రసన్నత కోసం ఏతెకాఫ్ చేసినా అల్లాహ్ అతనికి, నరకాగ్నికి మధ్య 3 పెద్ద పెద్ద గోతులను త్రవ్వేస్తారు.

## రమజాన్ మాసాన్ని ఉపేక్షించడం (దాని పట్ల అశ్రద్ధ వహించడం) తేరుకోలేనంత నష్టాన్ని కొనితెచ్చుకోవడం.

క్రిందటి పేజీలలో రమజాన్ మహిమలు, శుభాలను గురించి కొంత వివరణ దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి బోధనల వెలుగులో మీరు చూశారు. ఇక రమజాన్ వంటి గొప్ప వరాన్ని నిర్లక్ష్యం వల్ల చేజార్చుకున్న దౌర్భాగ్యులకు వినిపించిన జడిపింపులను కూడా చూస్తూ ముందుకు సాగండి.
ఒక రోజు దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు మెంబర్ పై ఎక్కుతూ మొదటి మెట్టు పై కాలుపెట్టి “ఆమీన్” అన్నారు. అలాగే రెండవ మరియు మూడవ మెట్టుపై కాలుపెడుతూ మళ్ళీ “ఆమీన్” అని అన్నారు. ఇది విన్న వారి అనుచరులు వారు మెంబర్ నుండి క్రిందకు దిగిన వెంటనే దీని వెనుక కారణమేమిటని ప్రశ్నించగా దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఈ విధంగా సమాధానమిచ్చారు: “నేను మొదటి మెట్టుపై కాలు పెట్టగానే హజ్రత్ జిబ్రయీల్ అలైహిస్సలామ్ గారు “రమజాన్ మాసమును పొంది కూడా, దాన్ని సద్వినియోగం చేసుకొని తమ పాప క్షమాపణ చేయించుకోలేకపోయిన అభాగ్యుడు నాశనము అవ్వుగాక” అని అన్నారు. దానికి నేను ఆమీన్ అని అన్నాను. ఆ తరువాత నా ప్రస్తావన

వచ్చినప్పుడు నా పై దరూద్ పఠించని వ్యక్తి, అలాగే వృద్ధాప్యంలో ఉన్న తల్లిదండ్రుల సేవచేయని వాడు నాశనము కావాలని రెండవ మరియు మూడవ మెట్టుపై కాలుపెట్టినప్పుడు శపించారు. దానికి నేను ఆమీన్ అని అన్నాను.

మరొక సందర్భంలో దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఇలా అన్నారు: రమజాన్ శుభాల నుండి విహీనపర్చబడ్డవాడే నిజమైన అభాగ్యుడు. మరొక హదీసులో ఇలా ఉంది: "ఉపవాసము ఉండి కూడా అబద్ధాలు, అనవసరపు మాటలను వీడనివాడు ఆకలితో, దాహముతో పడి ఉన్నా అల్లాహ్ కు ఏ మాత్రం అందులో ఆశక్తి లేదు.

మరొక హదీసులో ఇలా వుంది: "అకారణంగా రమజాన్ నెలలో ఒక్క ఉపవాసాన్ని విడిచిపెట్టినవాడు జీవితాంతము ఉపవాసాలు ఉన్నా దాని నష్టాన్ని పూడ్చలేడు. షబే ఖదర్ శు భాలకు దురమైనవాడు అన్ని శుభాలకు దూరమైనట్లే అని మరో హదీసులో ఉంది. రమజాన్ వంటి అమూల్యమైన, శుభకరమైన మాసములో నిర్లక్ష్యం వహించడం ఎంతో దౌర్భాగ్యం మరియు చేతులారా తమకు తీరని నష్టం చేసుకోవడమేనని ఈ హదీసుల (ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి బోధనల) ద్వారా మనం అర్థం చేసుకోగలం.

## రమజాన్ మాసపు శుభ ఘడియాలలో ఏమి చేయాలి?

1. సాధ్యమైనంత వరకు దివ్య ఖుర్ఆన్ పారాయణం ఎక్కువగా చేయాలి. స్వయంగా దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు రమజాన్ లో హజ్రత్ జిబ్రయీల్ అలైహిస్సలామ్ గారికి దివ్య ఖుర్ఆన్ పూర్తి పారాయణం చేసి వినిపించేవారు.

2. నఫిల్ నమాజులు అలాగే జిక్ర్ (దైవ ధ్యానం, అల్లాహ్ నామ స్మరణం) సాధ్యమైనంత ఎక్కువగా చేయాలి.

3. ముస్లిం సోదరుల కష్టనష్టాలలో పాలుపంచుకొని వారి అవసరాలను తీర్చేందుకు ప్రయత్నించాలి.

4. ఇతరుల నుండి ఏదైన కష్టం కలిగితే ఓర్పు, సహనాన్ని ప్రదర్శించాలి. తమ నుండి ఎవ్వరికీ ఏ కష్టము కలుగకుండా చూసుకోవాలి.

5. ఎవరైనా గొడవ పెట్టుకోవాలని, అనవసరపు విషయాలలోకి లాగాలని చూస్తే, నేను ఉ పవాసముతో ఉన్నానని సమాధానమిచ్చి దానికి దూరంగా ఉండాలి.

6. ఇతరులను దూషించడం, చెడ్డగా మాట్లాడడం కాదుకదా, అనవసరపు విషయాలు కూడా మాట్లాడకుండా ఉండాలి.

7. అస్సలు అబద్ధమాడకూడదు. ఎవ్వరి గురించి చాడీలు చెప్పకూడదు.

8. వాస్తవానికి షబే ఖదర్ ఎప్పుడో, ఏ తేదీన వస్తుందో ఎవ్వరికీ తెలియదు. కాబట్టి సాధ్యమైనంత వరకు ప్రతీ రాత్రి ఎంతో కొంత ఆరాధన, ప్రార్థన చేసుకుంటూ ఉండాలి. ఇలా చేస్తే రమజాన్ మాసంలో ఎదో ఒక రాత్రి షబే ఖదర్ అవుతుంది కాబట్టి మనకు కూడా దాని శు భాలలో భాగము లభిస్తుంది.

9. నఫిల్ కార్యాలకు కూడా ఫరజ్ కార్యం చేసినంత పుణ్యం లభిస్తుంది కాబట్టి సాధ్యమైనంత వరకు దానధర్మాలు చేస్తుండాలి.

10. మన క్రింద పనిచేసేవారి నుండి కొంత భారాన్ని తగించ్చి వారి ఉపవాసాలు సులువుగా సాగేలా సహకరించాలి.

11. "లా ఇలాహ ఇల్లల్లాహ్ ముహమ్మదుర్ రసూలుల్లాహ్" అలాగే "అస్తగ్ఫిరుల్లాహ్" ఎక్కువగా చదువుతూ ఉండాలి.

12. స్వర్గాన్ని అనుగ్రహించమని, నరకము నుండి కాపాడమని వేడుకుంటూ ఉండాలి.

13. ఎంతో వినయ–వినమ్రతలతో ప్రార్థనలు (దువాలు) చేసుకోవాలి.

14. న్యూస్ పేపర్లు, నవలలు చదవడం లాంటివి తగ్గించు కోవాలి.

15. ఫేస్‌బుక్, ట్విటర్ వంటి సోషల్ నెట్‌వర్కింగ్ సైట్లపై గప్‌షప్ చేస్తూ సమయాన్ని వృధా చేయడం పూర్తిగా మానుకోవాలి.

16. క్రికెట్, కార్టూన్ అని సాకులు చెబుతూ టీ.వీ చూడాలనే ఆలోచన కూడా మనసులో రాకూడదు. నిష్టగా పాటించని ఉపవాసాలకు ఆకలి, దప్పికలు తప్ప ఇంకే ప్రతిఫలము దక్కదన్న విషయాన్ని ఎప్పుడూ గుర్తుంచుకోవాలి.

17. తహజ్జుద్, ఇష్‌రాఖ్, చాష్త్, అవ్వాబీన్, సలాతుత్ తజ్‌బీహ్ మొదలైన ప్రత్యేక నమాజులు చేసేందుకు ప్రయత్నించాలి.

18. వీలైతే చివరి పది రోజులు ఏతెకాఫ్ చేసుకోవాలి. లేకపోతే మసీదుకు వెళ్ళిన ప్రతిసారి ఏతెకాఫ్ నియ్యత్ (సంకల్పము) చేసుకొని మసీదులో సమయాన్ని గడపాలి. స్త్రీలు కూడా తమ ఇంటి బాధ్యతలను నిర్వర్తిస్తూనే ఇంట్లో ఒక చోటు కేటాయించుకొని ఏతెకాఫ్ చేసుకోవాలి.

19. మసీదులో నమాజుల తరువాత జరిగే తాలీమ్ (ధార్మిక పుస్తక పఠన) లో కాసేపు కూర్చొని ధార్మిక విషయాలు, మంచి మాటలు నేర్చుకునేందుకు మొగ్గుచూపాలి.

20. తమకు తెలిసిన ధార్మిక విషయాలు, దువాలు, నమాజులో చదివే సూరాలు సాధ్యమైనంత వరకు ఇతరులకు కూడా నేర్పేందుకు కృషిచేయాలి.

21. పరాయ స్త్రీలను చూడడం, వృత్తి, వ్యాపార తదితర అవసరాలను మినహాయించి వారితో మాట్లాడడం మామూలు సమయాలలోనే పెద్ద పాపకార్యం. ఉపవాసము వుండి వీటికి పాలుపడడం ఇంకా ఘోర పాపం. కాబట్టి దీన్ని పూర్తిగా మానుకోవాలి. (రమజాన్, రమజానేతర సమయాలలోనూ).

22. ఇంట్లోవారిని, సహచరులని కసురుకోవడం, కోప్పడడం, తమ క్రింద పనిచేసేవారిని అనవసరంగా శిక్షించడం ఇలాంటివన్నీ మానేయాలి.

ఇప్పటి వరకు రమజాన్ మాసము, అందులోని ప్రత్యేక ఆరాధనల మహిమలు మరియు శుభాల గురించి తెలుసుకున్నాము, ఇక వీటి నియమనిబంధనలు కూడా తెలుసుకుందాం.

1. రమజాన్ నెల మొత్తం ఉపవాసాలు పాటించడం ఇస్లాం ధర్మపు 5 మూల స్తంబాలలో ఒకటి.

2. వయోజనులు, ఆరోగ్యవంతులు (శారీరకంగానూ, మానసికంగానూ), స్థానికులైన ప్రతీ ముస్లిం స్త్రీ పురుషుని పై ఇది విధిగావించబడింది.

3. అకారణంగా వీటిని విడిచిపెట్టేవాడు మహా పాపి, వీటిని తిరస్కరించువాడు కాఫిర్ (అవిశ్వాసి).

4. సంకల్పషుద్ధితో అనగా దైవ ప్రసన్నత కోసం ఉషోదయము నుండి సూర్యాస్తమయం వరకు అన్నపానియాలకు, లైంగిక వాంఛలకు దూరంగా వుండడం ఇది ఇస్లామీయ ఉపవాసం.

5. ఆరాధనలన్నిటిలో సంకల్పము ఎంతో కీలకమైనది. ఎందుకంటే ఆరాధనలన్నీ సంకల్పము పైనే ఆధారపడి వుంటాయని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు తెలిపారు. కాబట్టి ఉపవాసములోనూ సంకల్పము అనేది చాలా అవసరం. సంకల్పము మనసులో చేసుకునే దృఢ నిర్ణయాన్ని అంటారు. నేను ఉపవాసము ఉంటున్నాను అని నోటితో ఉచ్చరించే అవసరం లేదు. మనసులో అనుకుంటే చాలు.

6. రాత్రి పూటే రేపు ఉపవాసము ఉండాలని సంకల్పించుకోవడం ఉత్తమం. మిట్ట మధ్యానానికి ముందు సంకల్పించుకున్నా సరిపోతుంది. కాని ఉషోదయం నుండి అప్పటి వరకు అన్నపానియాలు లాంటివేమీ సేవించి ఉండకూడదు సుమా.

## ఉపవాసాన్ని భంగపరిచే విషయాలు

ఉపవాసాన్ని భంగపర్చే విషయాలు రెండు రాకాలుగా విభజించబడతాయి. కొన్నిటి వల్ల ఉపవాసము భంగమై ఖజాతోపాటు కఫ్ఫారా కూడా అనివార్యమైపోతుంది. కొన్నిటి వల్ల కేవలం ఖజా (అనగా దానికి బదులు మరో రొజు ఉపవాసము పాటించ వలసి వుంటుంది). కఫ్ఫారా (అనగా జరిమానా) విధించబడదు.

ముందుగా ఖజాతోపాటు కఫ్ఫారాను కూడా అనివార్యము చేసే విషయాలను చూద్దాం.

1. బుద్ధి పూర్వకంగా (కావాలని) తినడం, 2. త్రాగడం, 3. సంభోగము చేయడం. 4. సుర్మా/కాటుక పెట్టి లేదా నూనె పూసుకొని (అనగా ఉపవాసాన్ని భంగం కలిగించని పనులు చేసి) వీటి వల్ల నా ఉపవాసము భంగమైపోయిందని భ్రమించి ఉద్దేశపూర్వకంగా తినడం/త్రాగడం వల్ల ఉపవాసము భంగమై ఖజాతోపాటు కఫ్ఫరా (మూల్యం) కూడా చెల్లించాల్సి వుంటుంది. (అందకే ముందు ఉపవాసము వేటి వల్ల భంగమౌతుంది? వేటి వల్ల భంగము కాదు అన్న విషయాలు తెలుసుకోవాలి).

*కఫ్ఫరా (మూల్యం/జరిమానా): సరైన కారణం లేకుండా ఉపవాసాన్ని ఉద్దేశపూర్వకంగా భంగపర్చినందుకు ఒక బానిసను విడుదల చేయాలి, లేదా 60 మంది బీదవాళ్ళకు రెండు పూట్ల*

*కడుపు నిండా అన్నం పెట్టాలి లేదా వరుసగా 60 రోజులు ఉపవాసము ఉండాలి. మధ్యలో ఒక్క రోజు ఉపవాసము విరమించినా మొదటి నుండి మళ్ళీ ఆరంభించాలి.*

క్రింద పేర్కొనబడే విషయాల వల్ల ఉపవాసము భంగమౌతుంది కాని ఖజా (అనగా దానికి బదులు మరొక రోజు ఉపవాసము) ఉంటే సరిపోతుంది.

1. ముక్కులో లేదా చెవిలో మందు వేయడం, 2. ఉద్దేశపూర్వకంగా (ఉదా: నోట్లో చెయ్యి వేసి) వాంతు చేసుకోవడం, 3. నోరు పుక్కిలించేటప్పుడు గొంతులోకి నీళ్ళు వెళ్ళిపోవడం, 4. సంభోగము ద్వారా కాకుండా ఇంకే ఇతర రీతిలోనైనా (హస్త ప్రయోగం, స్త్రీలను గురించి ఆలోచించడం) లైంగిక వాంఛను తీర్చుకొని వీర్యాన్ని బైటికి తీయడం, 5. తినుబండారాలు కాకుండా కాగితం, రాయి లేదా ఇంకే ఇతర వస్తువు అయినా మింగడం, 6. అగర్‌బత్తి, బీడీ, సిగ్రేట్ మొదలైన వాటి పొగను కావాలని పీల్చడం; 7. ఉపోదయం ఇంకా కాలేదని భ్రమించి ఉపోదయం అయ్యాక కూడా తినడం లేదా త్రాగడం; 8. ఇఫ్తార్ వేళ కాకపోయినా పొరపాటున ఇఫ్తార్ వేళ అయిపోయిందని అనుకొని తినడం, త్రాగడం మొదలైనవి...

## ఉపవాస స్థితిలో అయిష్టకరమైన విషయాలు

అనగా వీటి వల్ల ఉపవాసము భంగము కాకపోయినా, వీటి నుండి జాగ్రత్త పడాలి. వీటి వల్ల పుణ్యఫలం తగ్గిపోతుంది.

1. అనవసరంగా పళ్ళతో దేన్నైనా నవలడం, ఉప్పు, కారం మొదలైనవాటి రుచి చూసి ఊసేయడం.
2. పేస్ట్, పళ్ళపొడి లేదా బొగ్గుతో పళ్ళు తోముకోవడం.
3. రోజంతా అపరిశుభ్రంగా ఉండడం.
4. పఛ్‌నా చేయించుకోవడం (అనగా గంట్లు పెట్టి నెత్తురు తీయించుకోవడం).
5. ఉపవాస స్థితిలో బూతులు, అశ్లీల మాటలు మాట్లాడడం. మొదలైనవి...

## ఉపవాస స్థితిలో సమ్మతమైన (అనుమతించబడిన) విషయాలు

1. మిస్వాక్ చేయడం, 2. నూనె రాసుకోవడం, 3. సుర్మా పెట్టుకోవడం లేదా కంట్లో మందు వేసుకోవడం, 4. మధ్యాహ్నం వేడి, దప్పికను తట్టుకోలేక చన్నీటితో స్నానం చేయడం, 5. అత్తరు పూసుకోవడం, దాని సువాసన పీల్చడం, 6. ఇంజక్షన్ లేదా టీకా పెట్టించుకోవడం, 7. మర్చిపోయి అన్నపానియాలు సేవించడం (మధ్యలో గుర్తొస్తే, ఎవరైనా గుర్తు చేస్తే వెంటనే వదిలేయాలి, నోట్లో అన్నం ఉంటే ఊసేయాలి), 8. అనుకోకుండా పొగ, దోమ మొదలైనవి గొంతులోకి చేరుకోవడం, 9. చెవిలో నిళ్ళు పోయడం, 10. దానంతట అదే వాంతు చేసుకోవడం, 11. ఎహ్‌తెలామ్ (అనగా నిద్రిస్తుండగా వీర్యం బైటికి రావడం), 12. పళ్ళ నుండి రక్తం రావడం (అది గొంతులోకి వెళ్ళకూడదు) 13. నిద్రలో వీర్యం బైటికి రావడం వల్ల

లేదా రాత్రి సంభోగించడం వల్ల తలంటు పోసుకోవడం అనివార్యమైపోయినా సహ్రీ చేసి ఉపవాసాన్ని ఆరంభించడం (కాని ఫజర్ నమాజుకు ముందు గుసుల్ చేసి నమాజు చేయడం తప్పనిసరి).

## ఉపవాస స్థితిలో మొగ్గుచూపవలసిన కార్యాలు

1. సహ్రీ భుజించడం, కనీసం ఒక కర్జూరపు పండుతో లేదా గుక్కెడు నీళ్ళతోనైనా సరే.
2. ఉషోదయానికి కాస్త ముందు సహ్రీ భుజించడం,
3. సూర్యుడు అస్తమించిన వెంటనే ఇఫ్తార్ చేయడం,
4. కర్జూరపు పండుతో లేదా నీళ్ళతో ఉపవాస విరమణ (ఇఫ్తార్) చేయడం,
5. ఇఫ్తార్ చేసేటప్పుడు ఇతరులను కూడా తోడు తీసుకోవడం,
6. మిస్వాక్ చేయడం,
7. ఇతర మాసాల కన్నా ఈ మాసంలో ఆరాధనలు ఎక్కువగా చేయడం,
8. ముష్తబహాత్ (అనగా ధర్మసమ్మతమైనవో కావో తెలియని సందేహకరమైన) విషయాల నుండి కూడా జాగ్రత్త పడడం.

ఈ క్రింది కారణాల వల్ల రమజాన్ నెలలో ఉపవాసం విరమించుకునేందుకు అనుమతించబడింది. వీరు ఈ ఆటంకాలు తొలగిపోయిన తరువాత విరమించుకున్న ఉపవాసాలన్నిటినీ ఖజా (పూర్తి) చేసుకోవాలి.

1. అనారోగ్యం: ఆరోగ్యం ఇంకా క్షీణించవచ్చని లేదా జబ్బు ఆలస్యంగా నయమౌతుందని లేదా ప్రాణానికి అపాయము కలుగవచ్చని డాక్టర్లు ఉపవాసాన్ని విరమించుకోమని సలహా ఇస్తే అతడు ప్రస్తుతం ఉపవాసాన్ని విరమించుకొని ఆరోగ్యం కుదుటపడిన తరువాత ఈ ఉపవాసాలను పూర్తిచేసుకోవచ్చు.
2. ప్రయాణం: రమజాన్ మాసంలో ఎవరికైనా కనీసం 48 మైళ్ళ ప్రయాణం (సుమారు 77 కిలోమీటర్లు) చేయాల్సివస్తే అతడు తన సౌలభ్యాన్ని దృష్టిలో పెట్టుకొని కావాలనుకుంటే ఉపవాసాన్ని విరమించుకోవచ్చు. ఉపవాసము వల్ల ప్రయాణంలో ఎటువంటి ఇబ్బంది ఉండదనుకుంటే ఉపవాసము ఉండడం శ్రేష్ఠమైనది. ఒక వేళ ఇబ్బంది కలగవచ్చని భావిస్తే ఉపవాసాన్ని విరమించుకోవడమే మంచిది. ప్రయాణంలో ఇబ్బందులు ఎదురుకుంటూ ఉపవాసాన్ని కొనసాగించడం ఏమాత్రం సమంజసం కాదు.
3. గర్భము: గర్భిణీలు ఉపవాసము ఉంటే తమకు గాని, గర్భములోని బిడ్డకు గాని అపాయము కలిగే అవకాశము వుంటే వారు ఉపవాసాన్ని విరమించుకోవాలి.
4. బాలింత: ప్రసవించిన స్త్రీలు ఉపవాసము ఉంటే బిడ్డకు పాలు కరువయ్యే ప్రమాదము వున్నా లేదా ఇంకే ఇతర అనారోగ్యాలకు గురయ్యే అవకాశము ఉన్నా వారు రమజాన్ లో ఉపవాసాన్ని విరమించుకోని అనురూపమైన సందర్భాన్ని చూసి ఖజా చేసుకోవాలి.

5. ముసలితనం: వృద్ధాప్యం మరీ ఎక్కువయిన స్త్రీపురుషులకు, కోలుకోలేని వ్యాధిగ్రస్తులకు ఉపవాస విధి నుండి మినహాయింపు ఉంది. ఇలాంటివారు ఉపవాసానికి బదులు తప్పనిసరిగా "ఫిదియా" ఇవ్వాలి. అంటే ఒక ఉపవాసానికి బదులు ఒక ఫిత్రా (1కిలో, 590 గ్రాముల గోదుమలు లేదా దాని మూల్యం) నిరుపేదలకు దానం చేయాలి.

6. ఒక వేళ వీరు ఫిదియా ఇచ్చిన తరువాత దేవుని దయతో మళ్ళీ కోలుకొని ఉపవాసము ఉండగలిగే స్థితికి చేరుకుంటే వీరిరువురు ఆయా ఉపవాసాలను ఖజా చేసుకోవాలి. (ఇచ్చిన ఫిదియా వృధా కాదు. దానికి వేరుగా పుణ్యం లభిస్తుంది.)

7. రుతుస్రావం, పురిటి రక్త స్రావానికి లోనై ఉన్న స్త్రీలు ఉపవాసము పాటించరాదు. వారు తరువాత ఆయా ఉపవాసాల ఖజా చేసుకోవాలి.

8. ఉపవాసము మధ్యలో అస్వస్థతకు గురై లేదా ఇంకే ఇతర కారణం వల్లనైనా ప్రాణోపాయ పరిస్థితి నెలకొంటే ఉపవాసము విరమించుకొని తరువాత దాని ఖజా పూర్తిచేసుకోవాలి.

9. ఉపవాసము ఆరంభించిన తరువాత ప్రయాణం చేయాల్సివస్తే ఉపవాసాన్ని మధ్యలో విరమించుకోవడం సరికాదు.

10. ఉపవాసము పాటిస్తే అనారోగ్యం పెరిగిపోవచ్చు అని కేవలం మనం అనుకొని ఉపవాసాన్ని విరమించుకోలేము. మంచి అనుభవం గల ముస్లిం డాక్టర్, లేదా ఇంతక ముందు ఆ వ్యాధికి గురైనవారు వారి సొంత అనుభవంతో తెలుపడం వల్లనే విరమించగలం.

## తరావీహ్

1. రమజాన్‌లో ఇషా నమాజు చదివిన తరువాత 3 రాకాతులు వితర్ నమాజు చదవక ముందు రెండు రెండు రకాతుల చొప్పున 20 రకాతులు నమాజు చదవడం స్త్రీపురుషులిద్దరి కొరకు సున్నతే ముఅక్కదహ్. అనగా మొగ్గుచూపవలసిన సున్నత్.

2. పూర్తి రమజాన్ మాసములో తరావీహ్ నమాజులో మొత్తం ఖుర్ఆన్ పఠించడం లేదా ఇమామ్ వెనుక వినడం సున్నత్. రెండు సార్లు పూర్తి ఖుర్ఆన్ పఠనం ఉత్తమం, మూడు సార్లు పూర్తిగా పఠించడం శ్రేష్ఠం. కాని షరతు ఏమిటంటే పూర్తి ఆశక్తితో దాని విలువను మనసులో పెట్టుకొని పఠించాలి, వినాలి. 3 సార్లు పూర్తి చేయాలనే రందిలో ఎలాపడితే అలా చదవడం దివ్య ఖుర్ఆన్‌ను అగౌరవర్చినట్లౌతుంది.

3. హదియా (డబ్బులు) ఇవ్వనిదే తరావీహ్ చదివించే వారు ఎవ్వరూ లభించకపోతే చిన్న చిన్న సూరాలతో మనమే నమాజు చదివించుకోవాలి. ఎందుకంటే తరావీహ్ చదివించడం కోసం డబ్బులు ఇవ్వడం, తీసుకోవడం రెండూ హరామ్ (నిషేధితం).

4. గడ్డం కత్తిరించేవాడిని లేదా బహిరంగంగా ఇంకే ఇతర పాపకార్యాలను చేసేవాడిని ఇమామ్‌గా నియమించడం సరికాదు. ఇటువంటి ఇమామ్ నేతృత్వంలో తరావీహ్ చదవడం "మక్రూహే తెహ్‌రీమీ" (ఎంతో అఇష్టకరం)

5. దివ్య ఖుర్ఆన్ ను సరిగ్గా ఉచ్చరించకుండా చాలా వేగంగా పఠించడం సరికాదు. ఇది కూడా ఒక పాపకార్యము. నేడు సాధారణంగా తక్కువ సమయంలో మొత్తం ఖుర్ఆన్ పఠించాలని దివ్య ఖుర్ఆన్ ను త్వర త్వరగా పఠిస్తూ దాని హక్కును భంగపర్చడం జరుగుతోంది. దీని వల్ల అటు చదివే వారికి, ఇటు వినేవారికి ఎవ్వరికీ పుణ్యం లభించదు.

6. ఒక వేళ ఎవరివైనా కొన్ని రకాతులు (ఆలస్యంగా రావడం వల్ల లేదా వజూ చేయాడానికి వెళ్ళడం వల్ల) మిగిలిపోతే వారు వితర్ నమాజు తరువాత మిగిలిన వాటిని ఒంటరిగా పూర్తి చేసుకోవాలి.

7. ఒక వేళ మసీదుకు వచ్చే ముందే ఇషా నమాజు పూర్తి చేసుకొని అందరూ తరావీహ్ నమాజులో నిమజ్నమై వుంటే, ముందు 4 రకాతులు ఇషా నమాజు, 2 రకాతులు సున్నత్ నమాజును ఒంటరిగా చేసుకొని ఆ తరువాత వారితో కలసి సామూహికంగా తరావీహ్ మరియు వితర్ నమాజుల్లో పాల్గొనాలి.

8. తరావీహ్ నమాజ్ చదివించడానికి యుక్త వయసుకు చేరుకోని పిల్లవాడ్ని ఇమామ్‌గా నియమించరాదు.

9. తరావీహ్ నమాజులో ప్రతి 4 రకాతుల తరువాత 4 రకాతులు చదివేందుకు ఎంత సమయం పడుతుందో అంత సేపు కూర్చోవడం ముస్తహబ్ (అభిలషనీయం). అలా కాకుండా కొంచం సేపు కూర్చున్నా పర్వాలేదు. ఇలా ప్రతి నాలుగు రకాతుల తరువాత కూర్చోవడాన్ని తర్వీహా అంటారు. దీని వల్లే ఈ నమాజుకు తరావీహ్ అని పేరు వొచ్చింది. ఈ విరామంలో నఫిల్ నమాజు లేదా జికిర్, ఖుర్ఆన్ పారాయణం లాంటి పుణ్యకార్యాలు ఎవరికి వారు చేసుకోవచ్చు. లేకపోతే నిశబ్ధంగానైనా కూర్చోవచ్చు. ఈ విరామ సమయంలో ప్రత్యేకించి ఎటువంటి సామూహిక ప్రార్థన, దువా అంటూ ఏమీ లేదు. కొన్ని ప్రాంతాలలో సామూహికంగా దువా చేయించమని బలవంతం చేస్తుంటారు. అలా దువా చేయడం తరావీహ్ నమాజులో ఒక భాగంగా భావిస్తుంటారు. అలాగే కొన్ని ప్రాంతాలలో "సుబ్బూహున్ కుద్దూసున్" అంటూ బిగ్గరగా ఒక దువా పఠించడం జరుగుతుంది. ఈ దువా ప్రతి నాలుగు రకాతుల తరువాత పఠించాలని అందరికీ చిట్టీలు ఇవ్వడం జరుగుతుంది. కాని ఇటువంటివేవీ దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు కాని, వారి శిష్యులు కాని, సలఫ్ సాలిహీన్ అనగా మన పూర్వికులు కాని ఎవ్వరు పాటించలేదు, ఇలా చేయాలని బోధించలేదు. కాబట్టి ఇది మనం సొంతగా కల్పించుకున్న ఒక ఆనవాయితి. ఇలా మనం కల్పించుకునే ఆనవాయితీలను బిద్అత్ అంటారు. వీటిని అంతం చేయడం ఎంతో అవసరం. దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు "కుల్లు బిద్అతిన్ జలాలహ్ వ కుల్లు జలాలతిన్ ఫిన్నార్" "కొత్త కొత్త ఆనవాయితీలను చేర్చడం మార్గభ్రష్టత్వము, ఇది నరకానికి దారితీస్తుంది" అని అన్నారు. అల్లాహ్ మనందరిని రక్షించుగాక.

సారాంశము ఏమిటంటే ప్రతి నాలుగు రకాతుల తరువాత కాసేపు విశ్రాంతి తీసుకోవాలి. ఈ విశ్రాంతి సమయంలో ఓపిక ఉన్నవారు విడిగా ఏమైనా జికర్, నమాజ్ చేసుకోవాలనుకుంటే చేసుకోవచ్చు. లేకపోతే నిశ్శబ్దంగా కూర్చొని విశ్రాంతి తీసుకోవచ్చు. ప్రత్యేకించి ఎటువంటి దువా, నమాజు లేదా ఇంకే ఇతర ఆచరన ఈ సమయంలో లేదు, సొంతగా కల్పించరాదు.

10. రమజాన్ నెల మొత్తం తరావీహ్ నమాజు చదవాలి. దివ్య ఖుర్ఆన్ పఠనం పూర్తి అయిపోయిందని మధ్యలో మానేయకూడదు.

## ఏతెకాఫ్

1. రమజాన్ మాసపు చివరి దశకంలో ఏతెకాఫ్ చేయడం "సున్నతే ముఅక్కదహ్ అలల్ కిఫాయహ్" అనగా ప్రాంత ప్రజలందరిలో కనీసం ఒకరైనా తప్పక చేయాలి. లేకపోతే అందరి పై ఆ పాపము వస్తుంది.

2. దైవ ప్రశన్నత కోరుతూ ఏతెకాఫ్ చేస్తున్నానని సంకల్పించుకొని మసీదులోనే ఉండిపోవడాన్ని ఏతెకాఫ్ అంటారు.

3. ఏతెకాఫ్ చేసేవారు మానవ సహజ అవసరాలు (మల మూత్ర విసర్జన) లేదా ధార్మిక అవసరాలు (జుమా నమాజు) కోసం బైటికి రాగలరు.

4. సమయానికి అన్నం తీసుకొచ్చి ఇచ్చేవారు ఎవ్వరూ లేకపోతే అన్నం తినడానికి కూడా బయిటికి రావచ్చు. ఎందుకంటే అది కూడా మానవ సహజ అవసరాలలో ఒకటి. కాని అన్నం తిన్న వెంటనే మసీదుకి వచ్చేయాలి, ఆలస్యం చేయకూడదు.

5. ధార్మిక/సహజ అవసరాలు కాకుండా ఇంకే ఇతర అవసరాల కోసమైనా మసీదు బైటికొస్తే అతడి ఏతెకాఫ్ భంగమైపోతుంది.

6. జుమా నమాజు కోసం లేదా చల్లదనం కోసం తలంటు పోసుకోవాలని బైటికి రాకూడదు.

7. పురుషులు 5 పూట్ల అజాన్ మరియు జమాత్ తో నమాజు జరిగే మసీదులో మాత్రమే ఏతెకాఫ్ చేయాలి. దగ్గరలో మసీదు లేదని కాలేజీలలో, వ్యాపార స్థలాలలో నమాజు కోసం కేటాయించుకున్న రూములలో ఏతెకాఫ్ చేయడం సరికాదు.

8. స్త్రీలు తమ ఇళ్ళలో ఒక గదిలో లేదా చిన్న చోటు కేటాయించుకొని అందులో ఏతెకాఫ్ చేసుకోవాలి.

9. ఏతెకాఫ్‌లో ఉన్నప్పుడు లౌకిక విషయాలు లేదా ఇతర అనవసరపు విషయాలను చర్చించడం మక్‌రూహ్ (అనగా అయిష్టకరమైన కార్యం). అంచేత దైవ ధ్యానం, జికిర్, ఖుర్ఆన్ పారాయణం, ధార్మిక పుస్తకాల అధ్యాయనంలోనే సమయాన్ని గడపాలి. అలసట కలిగినప్పుడు విశ్రాంతి తీసుకోవాలి.

సాధారణంగా ముస్లిం సోదరులు రమజాన్ నెలలోనే తమ జకాత్ చిల్లిస్తుంటారు. అందుకోసం ఈ సంచికలో జకాత్ గురించి పూర్తి వివరాలు అందించడం జరుతుంది.

## జకాత్



అరబీలో జకాత్ అంటే "వృద్ధి చెందటం, పరిశుద్ధమవ్వడం". ఇస్లామీ పరిభాషలో అల్లాహ్ ప్రసాదించిన సంపద నుండి ఒక నిర్ణీత భాగాన్ని దైవాదేశం ప్రకారంగా పేదలకు పంచిపెట్టడాన్ని జకాత్ అంటారు. జకాత్ ఇవ్వడం వల్ల మనిషి సంపద పరిశుద్ధము అవుతుంది. అతని పుణ్యం కూడా వృద్ధి చెందుతుంది. అందుకే దీన్ని జకాత్ అంటారు.

## జకాత్ ప్రాముఖ్యం

అల్లాహ్ ఏకత్వం, దైవదౌత్యం (ఈమాన్), నమాజ్ తరువాత 'జకాత్' ఇస్లాం లోని మూడవ సూత్రమన్న విషయం అందరికీ తెలిసిందే. పవిత్ర ఖుర్ఆన్ లో 'నమాజ్ స్థాపించండి, జకాత్ చెల్లించండి' అన్న జంట పదాలు 70 కంటే ఎక్కువ సార్లు ప్రస్తావించబడ్డాయి. అంటే, ధర్మంలో ఈ రెండిటి స్థానం దాదాపుగా సమానమేనన్న విషయం దీని ద్వారా మనకు అర్థమౌతుంది.

దైవ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి నిర్యాణం (మరణం) తరువాత కొన్ని ప్రాంతాల ప్రజలు బాహ్యంలో ఇస్లాం స్వీకరించి, అల్లాహ్ ఏకత్వం, దైవదౌత్యాన్ని అంగీకరించి, నమాజ్ చేస్తూ కూడా 'జకాత్' చెల్లించడానికి నిరాకరించారు. అప్పుడు హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ రజియల్లాహు అన్హు గారు, వారికి వ్యతిరేకంగా జిహాద్ ప్రకటన చేస్తూ, 'వారు నమాజ్, జకాత్‌ల మధ్య వ్యత్యాసం చూపారు, ఇలా చేయడం దైవం, దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ ధర్మాన్ని నిరాకరించడమే' అని తేల్చి చెప్పారు.

పవిత్ర ఖుర్ఆన్, దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి ఉపదేశాల్లో నమాజు స్థానం, జకాత్ చెల్లింపుల ప్రస్తావనను గమనిస్తే ధర్మంలో ఈ రెండిటి స్థానం దాదాపు సమానమేనన్న విషయం మనకు స్పష్టంగా అర్థమవవుతుంది. అంతేకాదు ఈ రెండిటి మధ్య ఒక ప్రత్యేక అనుబంధం ఉందని కూడా మనకు తెలుస్తుంది.

## జకాత్‌కు సంబంధించి మూడు కోణాలు

'జకాత్'లో పుణ్యానికి, ప్రయోజనానికి సంబంధించి మూడు కోణాలున్నాయి. ఒకటి: "దైవ విశ్వాసి అల్లాహ్ ప్రసన్నత, అల్లాహ్ కారుణ్యం, ఆయన సామీప్యత పొందడానికి ఏ విధంగానైతే, నమాజులోని ఖియామ్, రుకూ, సజ్దాల సహాయంతో దైవసన్నిధిలో తన దాస్య భావాన్ని, నిస్సహాయతను తన దేహం ద్వారా, ప్రాణం ద్వారా, నోటి ద్వారా వ్యక్తపరుస్తాడో, అదే విధంగా అతడు అల్లాహ్ సన్నిధిలో తన ధనానికి సంబంధించిన నజరానాను జకాత్ రూపంలో చెల్లించుకొని తన దగ్గర ఉన్నదంతా తనది ఏమాత్రం కాదని, అది దైవప్రసాదితమని నిరూపిస్తాడు. ఆ విశ్వాసంతోనే అల్లాహ్ ప్రసన్నత పొందే ఉద్దేశంతో దాన్ని ఆయన మార్గంలో త్యాగం చేస్తాడు. ఈ కోణం లోనే 'జకాత్'ను 'ఇబాదత్' (దైవారాధన) జాబితాలో చేర్చడం జరిగింది.

*అల్లాహ్ సన్నిధిలో తన అశక్తతను, దాస్య సంబంధాన్ని దీనంగా వ్యక్తపరచి, తద్వారా ఆయన కారుణ్యానుగ్రహాలను, ప్రసన్నతా సామీపత్యాలను అన్వేషించే ఉద్దేశంతో ఆచరించే కర్మలనే ధార్మిక పరిభాషలో 'ఇబాదత్' అంటారు.*

రెండు: జకాత్‌లో దాగిన మరో కోణం ఏమిటంటే, దీని ద్వారా అగత్యపరులు, అవసరార్థులు, బాధల్లో ఉన్న దైవదాసులు తదితరులకు సహాయ సహకారాలు లభిస్తాయి. ఈ కోణంలో చూసినప్పుడు 'జకాత్' సత్ప్రవర్తన, సదాచారణల అత్యున్నత స్థాయి ఆచరణా మార్గమని మనకు తెలుస్తోంది.

ఇక మూడవ ప్రయోజనం ఏమిటంటే, 'ధనవ్యామోహం విశ్వాసాన్ని నిర్వీర్యపరిచే ఒక మానసిక రుగ్మత. జకాత్ ఈ భయానక రుగ్మతకు చికిత్స చేసి, దాని విష ప్రభావము నుండి హృదయాన్ని శుద్ధపరుస్తుంది, మానసిక స్వస్థతను చేకూరుస్తుంది.

అందుకే పవిత్ర ఖుర్‌ఆన్‌లో: *ప్రవక్తా ! నీవు వారి సంపదల నుండి సద్‌ఖా (జకాత్) తీసుకొని వారిని (ఆత్మలను) పరిశుద్ధపరచు' అని చెప్పబడింది. (అత్ తౌబా: 105)*

మరోచోట:

*"......పరిశుద్ధతను పొందడానికి తన సంపదను (దైవమార్గంలో) ఖర్చుచేసే పరమ దైవభీతిపరుడు నరకాగ్నికి దూరంగా ఉంచబడతాడు". (అల్ లైల్: 21)*

బహుశా ఈ కోణంలోనే జకాత్‌కు "జకాత్" అన్న పేరు ఖరారు చేయడం జరిగింది. అసలు జకాత్ అంటేనే పరిశుద్ధ పరచడం అని అర్థం.

## పూర్వశాస్త్రాల్లో జకాత్ ఆదేశం

జకాత్‌కున్నటువంటి ఈ అసాధారణ ప్రయోజనాల దృష్ట్యనే పూర్వ ప్రవక్తల ధర్మశాస్త్రాలలో కూడా నమాజుతో సమానంగా ప్రాముఖ్యం కల్పించబడింది.

అంబియా సూరాలో హ్రజత్ ఇబ్రాహీమ్ అలైహిస్సలామ్, ఆయన తనయుడు హ్రజత్ ఇస్‌హాఖ్ అలైహిస్సలామ్ అలాగే ఆయన కుమారుడైన హ్రజత్ యాఖూబ్ అలైహిస్సలామ్‌లను గురించి ప్రస్తావిస్తూ ఇలా సెలవీయబడింది:

*"మేము వహీ ద్వారా సత్కార్యాలు చేయండి, నమాజును స్థాపించండి, జకాత్ ఇవ్వండి అని వారికి బోధించాము. వారు మమ్మల్ని ఆరాధించేవారు.* (అంబియా: 73)

అలాగే మర్యం సూరాలో హ్రజత్ ఇస్మాయిల్ అలైహిస్సలామ్ గురించి ఇలా పేర్కొనబడింది:

*"ఆయన తన ఇంటి వారిని నమాజు, జకాతులను పాటించండి అని ఆజ్ఞాపించాడు".* (మర్యం: 55)

ఇదేవిధంగా ఇశ్రాయేలీల పరంపరకు చెందిన చివరి ప్రవక్త హ్రజత్ ఈసా ఇబ్నే మర్యం అలైహిస్సలామ్‌ను గురించి ఇలా ఉంది. ఆయన తన జాతివారితో ఇలా అన్నారు:

*"నేను అల్లాహ్ దాసుణ్ణి, ఆయన నాకు గ్రంథానిచ్చాడు. నన్ను ప్రవక్తగా నియమించాడు. నేను ఎక్కడున్నాసరే, ఆయన నన్ను శుభకరునిగా చేశాడు. నేను జీవించి ఉన్నంత కాలం నమాజును, జకాతును పాటించమని ఆజ్ఞాపించాడు.* (మర్యమ్: 33)

అంటే, నమాజ్, జకాతులు పూర్వ ధర్మ శాస్త్రాల్లో కూడా శాశ్వత విధులుగా సదా ఉండేవన్న విషయం పవిత్ర ఖుర్‌ఆన్ లోని ఈ వాక్యాల ద్వారా మనకు స్పష్టంగా అర్థమౌతుంది.

## జకాత్ చెల్లించకపోతే?

హజ్రత్ అబూ హురైరహ్ రజియల్లహు అన్హు గారి కథనం ప్రకారం, దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఇలా ప్రవచించారు:

ఏ వ్యక్తికైతే అల్లాహ్ సంపదను ప్రసాదిస్తాడో, అతను దానికి జకాత్ చెల్లించనట్లైతే ప్రళయదినం నాడు ఆ సంపద ఓ భయంకర విషనాగు రూపంలో అతని ముందు ప్రత్యక్షమవుతుంది. ఆ విష ప్రభావం వల్ల దాని తల పైని వెంట్రుకలు రాలి, కళ్ళపై రెండు తెల్లని చుక్కలు ఏర్పడి ఉంటాయి. (ఈ రెండు లక్షణాలున్న సర్పం అత్యంత విషపూరితమైనదిగా ప్రసిద్ధి) అలాంటి సర్పం అతని మెడకు చుట్టుకొని అతని రెండు దవడలను పట్టుకొని (కాటువేస్తూ) "నేను నీ సంపదను, నువ్వు కూడబెట్టిన నిధిని" అంటుంది. ఈ విషయం చెప్పిన తరువాత దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు పవిత్ర ఖుర్ఆన్ లోని ఈ వాక్యం పఠించారు:

*"అల్లాహ్ తన అనుగ్రహాన్ని విరివిగా ప్రసాదించినప్పటికీ, పిసినారితనం చూపేవారు, ఈ పిసినారితనం తమకు మేలైనదని భ్రమించకూడదు. ఇది వారికొరకు ఎంతో హానికరమైనది. వారు తమ లోభత్వంలో కూడబెడుతున్నదే ప్రళయం నాడు వారి పాలిట కంఠపాశం అవుతుంది. భూమ్యాకాశాల వారసత్వం అల్లాహ్‌కే చెందుతుంది. మీరు చేసేదంతా అల్లాహ్‌కు తెలుసు".* (ఆలే ఇమ్రాన్: 180) (సహీ బుఖారీ).

హజ్రత్ ఆయిషా సిద్దీఖా రజియల్లహు అన్హా గారి ఉల్లేఖనం ప్రకారం "జకాతుగా చెల్లించవలసిన ధనం, ఇతర ధనంలో కలిసిపోతే, అది దాన్ని తప్పకుండా నాశనం చేస్తుందని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు తెలిపారు. (తారీఖే కబీర్ బుఖారీ, ముస్నదే హుమైదీ)

ఇమామ్ బుఖారీ రహ్మతుల్లాహి అలైహ్ గారి గురువులైన హజ్రత్ ఇమామ్ హుమైదీ రహ్మతుల్లాహి అలైహ్ గారు పై హదీసును వ్రాసి దాని అర్థాన్ని ఈ విధంగా తెలిపారు: "ఒక వ్యక్తి విధిగా జకాత్ చెల్లించాల్సి ఉన్నపట్టికీ అతడు దాన్ని చెల్లించనట్లైతే దాని అశుభం వల్ల మిగతా ధనం కూడా నాశనమైపోతుంది". అలాగే "జకాతు తీసుకోవడానికి అనర్హుడైన వ్యకి ఒక వేళ వక్రమార్గంలో జకాత్ వసూలు చేసుకుంటే, ఈ జకాత్ ధనం అతని ఇతర ధనంలో కలిసిపోయి, దాన్ని కూడా అపవిత్రం చేసేస్తుంది, దాన్ని నాశనం చేస్తుంది" అని ఇమామ్ అహ్మద్ గారు తెలిపారు.

## జకాత్ చెల్లించనిచో సంపద నశించును

హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఇట్లు తెలిపారు: భూమిపై గానీ, నీటిలో గానీ సంపద నశించుటకు కారణం జకాత్ చెల్లించక పోవటమే. అంతేకాక జకాత్ విధి (ఫరజ్) అయిన తరువాత చెల్లించనిచో, అది ఆ సంపదనంతటిని నాశనం చేయనిదే వదలదు. అనగా జకాత్ విధి అయిన తరువాత దానిని తప్పక చెల్లించ్చాలి. పిసినారి తనం చేత ఆ జకాత్‌ను చెల్లించకపోతే ఒకానొక రోజు ఆ సంపద తప్పక నశించిపోతుంది.

ఇమామ్ అహ్మద్ ఇబ్నే హంబల్ రహ్మతుల్లాహి అలైహ్ గారు "సంపద మొత్తము నశించును"

అనుటకు వివరణ ఇట్లు తెలిపారు: జకాత్ పేదల హక్కు, కాబట్టి జకాత్‌ను మన సొంత అవసరాలకు వాడుకునే హక్కు మనకు లేదు. దాన్ని మనం తిన్నా, వేరే విధంగా వాడుకున్నా అది మన విశ్వాసాన్ని, మన ధర్మాన్ని, మన పుణ్య ఫలాన్ని నశింపజేస్తుంది. కావున సంపద నశించును అంటే సంపద మూలంగా మనకు లభించ వలసిన ప్రయోజనము కలుగక పోగా నష్టము కలుగునని అర్థం.

జకాత్ మన పేద సోదరుల హక్కు. దాని మూలంగా వారి అవసరాలు తీరుతాయి. జకాత్ చెల్లించకపోతే మనం వారి హక్కును కొట్టి, వారిపై దౌర్జన్యం చేసిన వాళ్ళమౌతాము.

పైన పేర్కొనబడ్డ హదీసులు, దివ్య ఖుర్ఆన్ ప్రవచనాల ద్వారా జకాత్ యొక్క ప్రాముఖ్యత మనకు అర్థమైంది. ఇక జకాతుకు సంబంధించిన నియమ నిబంధనలను చూద్దాం.

## జకాత్ ఫరజ్ (విధి) కావడానికి షరతులు (నియమాలు)

1. ముస్లిం అయి ఉండాలి, 2. స్వేచ్ఛాజీవి అయి ఉండాలి, 3. బుద్ధిమంతుడై ఉండాలి, మతిస్థిమితము లేని వారిపై జకాత్ విధి కాదు, 4. వయోజనుడై ఉండాలి, పిల్లల పై జకాతు విధి కాదు, 5. సాహిబే నిసాబ్ అంటే జకాత్ విధి కావడానికి ఎంత ఆర్థిక స్తోమత అయితే షరతు గావించడం జరిగిందో అంత ఆర్థిక స్తోమత కలిగి ఉండాలి. ఇందులో ప్రాథమిక అవసారలు, అప్పులు మినహాయించి లెక్కించాలి, నివసించే ఇల్లు, ధరించే వస్త్రాలు, ఇంట్లో నిత్యవసర వస్తువులు, తాను వాడే వాహనము ఇవన్నీ ప్రాథమిక అవసరాలు. 6. సంపద పై సంవత్సరం గడవాలి.

## ఏ సొమ్ము నుండి జకాత్ చెల్లించాలి?

1. బంగారం, 2. వెండి, 3. పంట దిగుబడి, పండ్లు, 4. వ్యాపార సామాగ్రి, 5. మేత మేసే పశువులు, 6. గనుల నుండి తీయబడిన వస్తువులు, 7. భూమిలో నిక్షిప్తమై ఉన్న నిధులు.

వీటన్నిటి జకాత్ చెల్లించాల్సి ఉంటుంది. క్రింద వీటి వివరణ జాగ్రత్తగా ఆలకించండి.

బంగారం, వెండి, డబ్బు, వ్యాపార సామాగ్రిలో జకాత్ వివరాలు:

71/2 తులాలు బంగారం (అనగా గ్రా. 87. 479 మి.గ్రా) లేదా 521/2 తులాలు (గ్రా. 612. 360 మి.గ్రా) వెండి లేదా ఈ రెండిటిలో ఒకదాని విలువకు సరిపడేంత డబ్బు గాని వ్యాపార సామాగ్రి ఉంటే జకాత్ విధి అవుతుంది.

డబ్బు, బంగారం, వెండి, వ్యాపార సామాగ్రి రూపంలో ఉన్న పూర్తి సంపదపై (ప్రాథమిక అవసరాలు, అప్పులు మినహాయించి) 2 1/2 శాతం అనగా ప్రతి వెయ్యి రూపాయిలకు 25 రూపాయిలు చొప్పున చెల్లించాలి. (మరిన్ని వివరాలు ముందు వస్తున్నాయి)

## "ఉష్ర్" పంట దిగుబడి పై జకాత్:

షరియత్ పరిభాషలో భూ ఉత్పత్తులపై చెల్లించే జకాత్‌ను ఉష్ర్ అంటారు. ఏడాది మొత్తం లేదా ఎక్కువ శాతం ప్రకృతి సంబంధమైన వర్షాలు, నదులు, వాగులు, వంకల మూలంగా పండే భూముల్లోగాని, నదీ తీరాల తేమ కారణంగా పండే చిత్తడి నేలల్లోగాని ఉత్పత్తి అయ్యే ఫలసాయం నుంచి పదో భాగాన్ని ఉష్ర్‌గా చెల్లించడం మన విధి. అలాగే కృత్రిమ కాలువలు,

జలాశయాలు, సాధారణ బావులు, గొట్టపు బావుల మూలంగా పండే భూముల్లో ఉత్పత్తి అయ్యే ఫలసాయం నుండి 20వ భాగాన్ని ఉష్ర్‌గా చెల్లించాలి.

గమనిక: వెండి, బంగారాల్లా ఓ కచ్చితమైన పరిమితలో పంట పండతేనే జకాతు ఇవ్వాలని ఏమీ లేదు. పంట ఎంత పండినా (తకువైనా/ఎక్కువైనా) పైన పేర్కొనట్లుగా 10వ వంతు లేదా 20వ వంతు జకాతు చెల్లించాల్సి ఉంటుంది. ఉష్ర్ చెల్లించేటప్పుడు పంట పండించడానికి చేసిన అప్పులు, ఖర్చులు మినహాయించకుండా మొత్తం పంట నుండి 10వ వంతు లేదా 20 వ వంతు చెల్లించాలి. 10వ వంతు అంటే 10 సమాన భాగాలు చేసి అందులో ఒక భాగం చెల్లించాలి. 20వ వంతు అంటే 20 సమాన భాగాలు చేసి ఒక భాగం ఇవ్వాలి. పండ్ల తోటల వారు కూడా ఇలానే చేయాలి.

## పశువులలో జకాత్:

పశువుల బ్రీడింగే చేసేవారు పొలల్లోకి లేదా అడవులలోకి తీసుకెళ్ళి మేయిస్తే వాటిని సాయిమహ్ అంటారు. వాటి మేతకు ఇంట్లోనే ఏర్పాటు చేస్తే వాటిని అలూఫహ్ అంటారు. సొంత డబ్బులతో మేత ఏర్పాటు చేసేవారి పై జకాత్ లేదు. అడవుల్లోకి తీసుకెళ్ళి మేయించే వారు జకాత్ చెల్లించాలి. ఏ పశువులలో ఎంత జకాత్ చెల్లించాలో క్రింద చూడండి.

## మేక లేదా గొర్రెలలో జకాత్ వివరాలు:

1. మేక/గొర్రెలు 40 కంటే తక్కువ ఉంటే వాటిలో జకాత్ లేదు.
2. 40 నుండి 120 వరకు మేక/గొర్రెలకు ఒక మేక/గొర్రె జకాత్‌గా ఇవ్వాలి.
3. 121 నుండి 200 మేకలు లేదా గొర్రెలకు 2 మేకలు/గొర్రెలు జకాత్‌గా ఇవ్వాలి.
4. 201 నుండి 399 వరకు ఉంటే మూడిటిని జకాత్‌గా ఇవ్వాలి.
5. 400కు పైబడితే ప్రతీ వందకు ఒకటి చొప్పున (400 కు 4; 500 కు 5; 600 కు 6) ఇవ్వాలి.
6. జకాత్‌లో ఇచ్చే జెంతువు కనీసం ఒక సంవత్సరం నిండినదై ఉండాలి.

## గేదెలు, ఆవుల జకాత్:

1. జకాత్ విషయంలో గేదెలు, ఆవులు, దున్నలు, ఎద్దులు అన్నీ ఒకే లెక్క క్రిందికి వస్తాయి.
2. 30 కన్నా తక్కువ సంఖ్యలో ఉంటే వాటి పై జకాత్ లేదు.
3. 30 నుండి 39 లోపు ఉంటే యేడాది వయస్సు గల ఒక దూడను జకాత్ గా ఇవ్వాలి.
4. 40 నుండి 59 లోపు ఉంటే రెండేళ్ళు పూర్తిగా నిండిన ఒక దూడను ఇవ్వాలి.
5. 60 నుండి 69 లోపు ఉంటే యేడాది వయసు గల రెండు దూడలు ఇవ్వాలి.
6. 70 నుండి 79 లోపు ఉంటే యేడాది వయసు గల ఒక దూడతోపాటు రెండేళ్ళు పూర్తిగా నిండిన మరో దూడను ఇవ్వాలి.
7. 80 నుండి 89 లోపు ఉంటే రెండేళ్ళ వయసు గల రెండు దూడలు ఇవ్వాలి.
8. 90 నుండి 99 లోపు ఉంటే యేడాది వయసుగల మూడు దూడలు ఇవ్వాలి.

9. 100 నుండి 109 లోపు ఉంటే యేడాది వయసుగల రెండు దూడలతోపాటు, రెండేళ్ళ వయసుగల ఒక దూడను ఇవ్వాలి.
10. ఈ సంఖ్య పెరిగే కొద్ది జకాత్ ప్రమాణం కూడా పెరుగుతుంది. వీటి జకాత్ నిర్ణయించడానికి సులువైన పద్ధతి ఏమిటంటే 30, 40 సంఖ్యలను ప్రమాణంగా తీసుకొని 60కు మించి ఎంత ఎక్కువ ఉన్నా సరే 30, 40 సంఖ్యలనే ప్రమాణంగా తీసుకొని జకాత్ ఇవ్వాలి.
ఒంటెలు మొదలైన జంతువుల బ్రీడింగ్ సాధారణంగా మన ప్రాంతాల్లో జరుగదు కాబట్టి వాటి జకాత్ గురించి వివరణ ఇక్కడ వ్రాయడం లేదు.

## జకాత్ నియమ నిబంధనలు

1. జకాత్ విధి కావడానికి అవసరమైనంత డబ్బు లేదా వెండి, బంగారాలు ఉన్నవారిని ముస్లింల పరిభాషలో సాహిబే నిసాబ్ (స్థితి పరుడు లేదా సంపన్నుడు) అని అంటారు.
2. సాహిబే నిసాబ్ కావాలంటే ఎంత బంగారం లేదా వెండి లేదా నగదు కావాలో ముందే తెలుసుకున్నాము.(71/2 తులాల బంగారం లేదా 521/2 తులాల వెండి లేదా వాటిలో ఏ ఒక్క దాని మూల్యానికైనా సరిపోయేంత డబ్బు లేదా వ్యాపార సామాగ్రి ఉండాలి).
3. ఈ రోజుల్లో బంగారం ధర కన్నా వెండి ధర తక్కువగా ఉంది. కాబట్టి మనం 52 1/2 తులాల వెండి మూల్యాన్ని కొలమానంగా తీసుకుంటే మన పై జకాత్ విధి అయ్యిందో లేదో సులువుగా, కచ్చితంగా తెలిసిపోతుంది. చాలా మంది బంగారపు ధరను చూసుకొని వారిపై జకాత్ విధికాలేదని భ్రమపడుతుంటారు. అవును, ఇవాళ 7 1/2 తులాల బంగారపు విలువ 90,000/– , 52 1/2 తులాల వెండి ధర 60,000/– ఉందనుకోండి. చాలా మంది వారి దగ్గర 70,000/– నగదు లేదా అంత ఖరీదు చేసే బంగారము లేదా వెండి ఉంచుకొని కూడా వారిపై జకాత్ విధి కాలేదని పొరబడుతుంటారు. వాస్తవానికి వారి వద్ద 52 1/2 తులాల వెండి మూల్యానికి సరిపడ డబ్బు లేదా బంగారం లేదా వెండి ఉండడం వల్ల వారిపై జకాత్ విధి అయిపోయింది.
2. ఎవరి దెగ్గిరైనా కొంత బంగారము, కొంత వెండి, కొంత నగదు, కొంత వ్యాపార సామగ్రి ఉన్నాయి. కానీ ఏ ఒక్కటి కూడా జకాత్ విధి అగుటకు కావలసిన కనీస పరిమితిలో లేదు. కాని వాటన్నిటి విలువను కలిపితే 7 1/2 తులాల బంగారపు విలువ లేక 52 1/2 తులాల వెండి విలువతో సమానంగా కాని లేక అంతకన్నా ఎక్కువగా గాని ఉంటే అతను సాహిబే నిసాబ్‌గా పరిగణించబడతాడు. ఆ సంపదపై సంవత్సరం గడిచిన తరువాత జకాత్ చెల్లించవలసి ఉంటుంది.
3. సంవత్సరం గడవడం అంటే ఒక వ్యక్తి జనవరి లో ఉద్యోగంలో చేరాడు లేదా వ్యాపారం మొదలు పెట్టాడని అనుకోండి. మెల్ల మెల్లగా అతడు డబ్బు కూడబెట్టి “మే” నెలలో 52 1/2 తులాల వెండి మూల్యం జమచేసుకున్నాడు. ఇప్పుడు అతడి దగ్గర జకాత్ విధి కావడానికి

కావలసినంత సొమ్ము వచ్చేసింది. కాని ఇప్పుడే అతడిపై జకాత్ చెల్లించడం విధి కాదు. మళ్ళీ "మే" వచ్చేసరికి అతడి దగ్గర ఆ డబ్బు అలాగే ఉంటే (అలాగే అంటే ఖర్చుపెట్టకుండా అలాగే ఉండాలని కాదు, జకాత్ విధి కావడానికి ఎంత ఉండాలో అంత ఉంటే చాలు. మధ్యలో అవసరానికి వాడుకున్నా, ఇంకా డబ్బు జమా చేసినా) అతడు జకాత్ చెల్లించాలి.

4. జకాత్ విధి కావడానికి కావలసినంత డబ్బు వచ్చిన తరువాత, సంవత్సరం చివర ఎంత సంపద ఉందో చూసుకొని దానిపై జకాత్ విధి అవుతుందా లేదా చూసుకోవాలి. ఇప్పుడు గనక జకాత్ విధి కావడానికి కావల్సినంత డబ్బు లేకపోతే జకాత్ చెల్లించనఖ్ఖరలేదు. దేవుని దయతో సంవత్సరం గడిచినా కూడా అతడు సాహిబే నిసబ్ గానే ఉంటే అప్పుడు జకాత్ చెల్లించాలి.

5. ఉదా: "మే" లో 50,000 జమ అవ్వడం వల్ల అతడు సాహిబే నిసాబ్ అయ్యాడు. మళ్ళీ "మే" వచ్చేసరికి అతడి దగ్గర జకాత్ విధి అవ్వడానికి సరిపడ డబ్బు లేకుంటే అతడు జకాత్ చెల్లింనఖ్ఖరలేదు. ఒక వేళ ఆ 50,000 అలాగే ఉన్నా లేదా అది రెట్టింపు అయినా అతడు ఆ మొత్తము ధనము పై (అంటే ఆరంభంలో ఉన్న 50,000 కొంత కాలానికి జమ అయిన మరో 50,000 మొత్తం మీద) జకాత్ చల్లించాలి.

6. వట్టి బంగారము లేదా వెండి లేకుండా అందులో ఏదైనా ఇతర లోహము (ఇత్తడి వగేరా) కలిసి ఉంటే వాటిలో ఏది ఎక్కువ పరిమాణములో ఉందో చూసుకోవాలి. బంగారము ఎక్కువ ఉంటే దాన్ని బంగారపు వస్తువుగా పరిగణించి దాని జకాత్ చెల్లించాలి. ఇత్తడి లేదా ఇతర లోహము ఎక్కువ పరిమాణములో ఉంటే దాన్ని ఇత్తడి వస్తువుగా పరిగణించాలి.

7. "వెండి, బంగారాలు" ఆభరణాల రూపంలో ఉన్నా, ఇతర వస్తువుల రూపంలో ఉన్నా అలాగే అవి వాడకంలో ఉన్నా లేకున్నా వాటిపై జకాత్ చెల్లించక తప్పదు.

8. వెండి, బంగారము తప్ప ఇంకే వస్తువులు ఉన్నా, అవి ఎంత ఖరీదువైనా వాటిపై జకాత్ లేదు. అందుకే వజ్రాలు, మాణిక్యాలపై జకాతు లేదు. కాని అవే వజ్రాలు, మాణిక్యాలు అమ్మకానికైతే వాటిపై కూడా జకాతు చెల్లించాలి.

9. ఇళ్ళు, స్థలాలు లాంటి స్థిర ఆస్తుల పై జకాత్ లేదు. కాని వాటి నుండి వచ్చే ఆదాయం (అద్దె వగైరా) పై జకాత్ చెల్లించాలి.

10. అలాగే ఆ ఇళ్ళు, స్థలాలు అమ్మకానికైతే వాటిపై కూడా జకాతు చెల్లించాలి. రియల్ ఎస్టేట్ బిజినెస్ చేసేవారు గమనించాలి.

11. ఇతర ఆరాధనల్లాగే జకాత్ చెల్లించడానికి సంకల్పం (నియ్యత్) ఎంతో అవసరం. సంకల్పించుకోకుండా దానం చేస్తే జకాత్ చెల్లించినట్లు పరిగణించబడదు. ఉదా: పేదలకు డబ్బు దానం చేసి కొంత కాలానికి ఆనాడు పేదలకు ఇచ్చిన దానము జకాత్ క్రింద లెక్కించుకుంటాను అని అంటే కుదరదు. ఇచ్చేటప్పుడే జకాత్ దానం చేస్తున్నాను అని

సంకల్పించుకొని ఇవ్వాలి. కనీసం మెత్తం సంపద నుండి జకాత్ డబ్బును విడిగా తీసి ఇది జకాత్ కోసం తీసిన డబ్బు అని సంకల్పించుకొని అవసరమొచ్చినప్పుడల్లా అందులో నుంచి డబ్బు తీసి పేదలకు దానం చేసినా సరిపోతుంది.

12. జకాత్ ఇచ్చేటప్పుడు ఇవి జకాత్ డబ్బులు అని చెప్పి ఇవ్వనక్ఖరలేదు. మనసులో జకాత్ చెల్లిస్తున్నట్లు సంకల్పించుకుంటే చాలు.

13. జకాత్‌లో డబ్బు మాత్రమే ఇవ్వాలని ఏమీ లేదు. పేదల అవసరాలను పరిగణంలోకి తీసుకొని వారికి బట్టల రూపంలో, ఆహార రూపంలో, నిత్యవసరాల వస్తువుల రూపంలో ఇచ్చినా సరిపోతుంది.

14. సంవత్సరం గడిచిన తరువాత బంగారం, వెండి, డబ్బు, వ్యాపార సామాగ్రిలో నుండి 2.5% జకాత్ ఇవ్వాలని తెలుసుకున్నాము. కాని ఎవరైనా సంవత్సరం గడవక ముందే వాటి జకాత్ చెల్లించాలని అనుకుంటే చెల్లించవచ్చు. అందులో ఆటంకమేమీ లేదు. కాని సంవత్సరం చివరిలో ఇంత డబ్బు మిగిలి ఉండవచ్చు అని అంచనా వేసి జకాతు చెల్లించిన తరువాత దేవుని దయతో అంచనా వేసిన దాని కంటే ఎక్కువ జమ అయితే ఇప్పుడు ఎంత అయితే ఎక్కువ మిగిలిందో దాని నుండి 2.5% జకాత్ చెల్లించాలి.

15. సంవత్సరం గడిచిన వెంటనే జకాత్ చెల్లించేందుకు ప్రయత్నించాలి. అనవసరంగా ఇందులో ఆలస్యం చేయరాదు.

16. సంవత్సరం గడిచాక కూడా జకాత్ చెల్లించకపోతే అది అతడి పై భారంగానే మిగిలి ఉంటుంది. జీవితంలో ఎప్పుడైనా (కనీసం చనిపోవక ముందైనా) దాన్ని చెల్లించి ఆ భారాన్ని తొలగించుకోవాలి. లేక పోతే ప్రళయదినాన ఎన్నో శిక్షలను అనుభవించాల్సి వస్తుంది.

17. సంవత్సరం గడవడం అంటే ఇంగ్లీష్ క్యాలెండర్ ప్రకారం కాదు. ఇస్లామీ నెలల ప్రకారం సంవత్సరం గడిస్తే జకాత్ విధి అవుతుంది.

18. బిజినెస్‌లో అమ్మకానికి ఉన్న ప్రతీ దానిపై జకాతు చెల్లించాల్సి ఉంటుంది. బట్టల కొట్టు పెడితే అందులోని బట్టల పై, కిరాణా షాప్ పెడితే సరుకుపై, మెడికల్ షాప్ పెడితే మందులపై ఇలా బిజినెస్ ఇన్‌వెస్ట్‌మెంట్ మొత్తానిపై జకాత్ చెల్లించాల్సి ఉంటుంది.

16. బిజినెస్ ఇన్‌వెస్ట్‌మెంట్ అంటే షాపు లేదా ఆఫీసులో ఉన్న ఫర్నీచర్, మెషినరీ వీటన్నిటిపై జకాతు చెల్లించాలని అపార్థము చేసుకోరాదు. మన బిజినెస్ లోని "సరుకు" పై జకాత్ చెల్లించాలి కాని, ఆ సరుకు ఉత్పత్తి చేయడానికి వాడే పరికరాలు, లేదా ఆ బిజ్‌నెస్ కోసం అవసరమైన పస్తువులు (ఉదా: షాప్‌లోని ఫర్నీచర్, కంప్యూటర్స్, డెకరేషన్ వగైరా పై జకాత్ విధికాదు.)

17. షేర్స్ బిజినెస్ చేసేవారు వారి షేర్లను కూడా లెఖ్ఖించి జకాతు చెల్లించాలి. ఎందుకంటే అవి కూడా వ్యాపార సామాగ్రి క్రిందకే వస్తాయి.

18. ఇతరుల నుండి తీసుకున్న అప్పును మినహాయించి అతని దగ్గర ఉన్న ధనము అంతటిని లెక్కించి జకాత్ ఇవ్వాలి. (కాని ఇన్‌కం ట్యాక్స్ వాళ్ళ నుండి తప్పించుకోడానికి చేసుకున్న నామమాత్రపు అప్పులు మినహాయించ లేరు. వాస్తవానికి అవి అసలు అప్పులే కావు).

19. మనమే ఎవరికైనా అప్పు ఇచ్చి ఉంటే దాన్ని కూడా మినహాయించ కుండా లెక్కపెట్టి జకాతు చెల్లించాలి. ఒక వేళ అప్పు తీసుకున్నవాడు దివాళా ఎత్తేయడం వల్ల, పారిపోవడం వల్ల లేదా ఇంకే ఇతర కారణం వల్ల డబ్బు తిరిగి వస్తుందనే నమ్మకం లేకపోతే దాన్ని లక్కించనక్ఖరలేదు.

20. కూతురు పెళ్ళి కోసం, ఇల్లు కట్టడం కోసం లేదా హజ్ కోసం అని తీసి ఉంచిన డబ్బు, ఆభరణాలపై కూడా జకాత్ చెల్లించక తప్పదు.

21. చీటీ డబ్బులలో కూడా జకాత్ ఇవాల్లి. కాని దాని విధానము ఏమిటంటే 20 నెలల చీటీలో 6 నెలలు కట్టి ఇంకా 14 నెలలు కట్టాల్సి ఉంటే ఇప్పటి వరకు కట్టిన దానికి జకాత్ ఇవ్వాలి. కట్టాల్సి ఉన్న దానిపై జకాత్ లేదు.

22. పి.యఫ్ చేతికందనంతవరకు అందులో జకాత్ చెల్లింపు విధికాదు. 23. బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయడం నిషేధితం. తెలియక ఎవరైనా చేస్తే దాన్ని వెనక్కి తీసుకోవాలి. ఎన్ని సంత్సరాలైతే అది బ్యాంక్‌లో ఉందో అన్ని సంవత్సరాల జకాత్ అందులోనుంచి చెల్లించాలి. ఇన్‌షురెన్స్ పాలసీ కూడా ఇట్లాంటిదే.

24. జకాత్ పలువురు పేదవారిలో పంచినా, ఒకే వ్యక్తికి ఇచ్చినా సరిపోతుంది. కాని ఒకే వ్యక్తికి జకాత్ విధి కావడానికి కావలసినంత డబ్బు ఇవ్వడం అఇష్టకరం. కాని ఆపరేషన్, అప్పు తీర్చడం లాంటి వాటికోసం ఇస్తే తప్పులేదు.

25. ఎవరికైనా నా తరుపు నుండి జకాత్ చెల్లించు అని ఆజ్ఞాపిస్తే అతడు చెల్లించిన పక్షంలో జకాత్ భారం తీరిపోతుంది. అతడికి డబ్బు ఇవ్వాల్సి ఉంటుంది. ఒక వేళ మనం చెప్పకుండానే అతడు మన తరఫున జకాత్ చెల్లిస్తే అది చెల్లుబాటుకాదు. అతడు చెల్లించినట్లు మనకు తరువాత చెప్పినా సరే.

26. ఒక ప్రాంతం వారి జకాత్‌ను ఇతర ప్రాంతం వారికి ఇవ్వడం అఇష్టకరం. ఒక వేళ ఆ ప్రాంతంలో ఉన్నది మన బంధువులైతే లేదా వారు మన ప్రాంతం వారి కన్నా ఎక్కువ అవసరంలో ఉంటే వారికి ఇవ్వడంలో తప్పులేదు.

## జకాత్ ఇచ్చేవారు వీటిని దృష్టిలో పెట్టుకోవాలి: (ఆదాబ్)

1. జకాత్ ఇచ్చిన తరువాత వారి నుండి మనం ఏమీ ఆశించకూడదు. వారు ఋణపడి ఉండాలని కాదు కదా కనీసం వారి నుండి కృతఘ్నుతలు కూడా ఆశించకూడదు. ఇలా ఏమైనా ఆశించి జకాత్ ఇస్తే అది అల్లాహ్ కోసం చేసిన ఆరాధనగా పరిగణించబడదు. ప్రాపంచిక ప్రయోజనాల కోసం చేసిన కార్యంగా పరిగణించబడుతుంది.

2. ఎవరికైతే జకాత్ ఇస్తున్నారో వారికి ఏవిధమైన ఇబ్బంది కలిగించకూడదు. ఇబ్బంది మాటల ద్వారానూ కలుగుతుంది (ఉదా: వారిని కసురు కోవడం, అగౌరవంగా మాట్లాడడం), చేష్టల ద్వారానూ కలుగుతుంది (ఉదా: వారిని క్రింది చూపు చూడడం, వారిని అప్పుడు, ఇప్పుడు అని మాటిమాటికి తిప్పించడం, వారితో పనులు చేయించుకోవడం).

3. "నిజాయితీగా (నిజంగా జకాత్‌కు అర్హుడై) జకాత్ తీసుకునేవాడు (చెల్లించేవాడు కాదు తీసుకునేవాడు) అల్లాహ్ మార్గంలో జిహాద్ చేసేవాడితో సమానం" అని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు బోధించిన విషయాన్ని దృష్టిలో పెట్టుకొని వారితో సగౌరవంగా వ్యవహరించాలి.

4. జకాత్ ఇచ్చి మనం వారిపై దయచూపలేదు, వారే మన జకాత్ సీకరించి మన ధనాన్ని అన్ని అశుభాల నుండి పరిశుద్ధము చేసి, అన్ని రకాల ఆపదల నుండి దానికి రక్షణ కల్పించి మనకు మేలు చేశారని భావించాలి. గుర్తుంచుకోండి ! ప్రళయ దినానికి ముందు జనం తమ జకాత్ డబ్బులు తీసుకొని బీదవారి కోసం పగలంతా వెతికినా వారికి జకాత్ తీసుకునేవాడు ఒక్కడూ దొరకడు అని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు తెలిపారు. ఇవాళ మన జకాత్ తీసుకునేవారు మనకు దొరుకుతున్నారంటే అది మన సౌభాగ్యం.

5. ప్రళయ దినాన అందరూ అవస్థలు పడుతుంటే అల్లాహ్ ఏడుగురికి మత్రం తన సింహాసపు నీడలో చోటు కల్పిస్తాడు. ఆ ఏడుగురిలో ఒకరు కుడిచేతితో దానం చేస్తే తమ ఎడమ చేతికి కూడా తెలియనంత రహస్యంగా దానం చేసేవారని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు తెలిపారు. జకాత్ ఇచ్చేటప్పుడు దీన్ని దృష్టిలో పెట్టుకోవాలి.

6. జకాత్ ఇచ్చిన తరువాత ఫలానా సమయంలే నేను వాడ్ని ఆదుకున్నాను అని చెప్పుకుంటూ తిరగ కూడదు. లేదంటే అతడి జకాత్ స్వీకరించబడదు.

## జకాత్ ఎవరికి ఇవ్వాలి?

అల్లాహ్ తఆలా సూరే తౌబా లోని 60 వ వచనములో ఎనిమిది మంది జకాత్ ధనము తీస్కొవడానికి అర్హులుగా పేర్కొన్నారు. ఆ ఎనిమిది మందికి తప్ప ఇంకెవ్వరికీ జకాత్ ఇవ్వడం, పుచ్చుకోవడం ధర్మసమ్మతము కాదు.

జియాద్ బిన్ హారిస్ సుదాయీ రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి సన్నిధిలో ఒక వ్యకి వచ్చి తనకు జకాత్ ధనము నుండి కొంత అనుగ్రహించమని విన్నపించుకోగా దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఈ విధంగా సెలవిచ్చారు:

"జకాత్ ధనం ఎలా వ్యయపరచాలి అన్న విషయం, అల్లాహ్ తఆలా ప్రవక్తల అభీష్టానికో, ప్రజల అభీష్టానికో వదిలేయలేదు. స్వయంగా ఆయనే దాన్ని నిర్ణయించి, ఎనిమిది భాగాల్లో (కోవల్లో) విభజించారు. మరి మీరు వాటిలో ఏదో ఒక కోవలోకి వస్తేగాని నేను జకాత్ ధనం లోనుంచి మీకు ఇవ్వలేను". (అబూదావూద్)

1. ఫుకరా: అంటే, పేదసాదలైన సాధారణ ప్రజలందరూ ఈ కోవలోకి వస్తారు. అసలు ఫఖీర్ అన్న పదం అరబీ భాషలో సంపన్నులకు వ్యతిరేకంగా వాడబడుతుంది. ఈ ప్రకారం "సంపన్నులు కాని", సాధారణ ప్రజలందరూ ఈ కోవలోకి వస్తారు. అంటే జకాత్ విధి అయ్యేంతటి ధన సంపదలు లేనివారని అర్థం. ధర్మశాస్త్రంలో సంపన్నతకు కొలమానం ఇదే.
2. మసాకీన్: అంటే కనీస అవసరాలు కూడా తీర్చుకునే స్థోమతలేని నిరుపేదలు. రిక్త హస్తాలతో ఉన్న అభాగ్యులు అని అర్థం.
3. ఆమిలీన్: అంటే జకాత్ వసూలు చేసే ఉద్యోగులు. ఒకవేళ వీరు సంపన్నులైనప్పటికీ, జకాత్ వసూలు కోసం సమయం కేటాయించి శ్రమపడినందుకు అందులో నుండి వేతనం తీసి ఇవ్వవచ్చు. దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి కాలంలో ఈ సంప్రదాయం ఉండేది.
4. ముఅల్లఫతుల్ ఖులూబ్: ప్రజల హృదయాలను చూరగొనడానికి, ధర్మం వైపునకు ఆకర్షితులైన వారి అవసరాలు తీర్చడానికి, వారి సంతోషం కోసం జకాత్ పద్దు నుండి వారి కోసం ఖర్చుచేయవచ్చు.
5. రిఖాబ్: బానిసలు, సేవకుల విముక్తికి, వారిని స్వతంత్రులుగా చేయడానికి జకాత్ ధనాన్ని వినియోగించవచ్చు.
6. గారిమీన్: అంటే, రుణభారంతో నలిగిపోతున్నవారు. తమ స్థోమతకు మించి అప్పులు అయి, వాటిని తీర్చలేనివారు. ఇలాంటి వారిని ఆదుకొని రుణవిముక్తులు చేయడానికి జకాత్ ధనం ఖర్చుచేయవచ్చు.
7. ఫీ సబీలిల్లాహ్: అంటే అల్లాహ్ మార్గంలో పోరాడేవారికి జకాత్ ద్వారా సహాయ సహకారాలు అందించడం.
8. ఇబ్నుస్సబీల్: అంటే బాటసారులు. ధనవంతులైనప్పటికీ ఒక్కోసారి ప్రయాణంలో ఉన్నప్పుడు అకస్మాత్తుగా ఏదైనా అవసరం ఏర్పడవచ్చు. అలాంటి బాటసారులకు కూడా జకాత్ ధనం నుండి సహాయం అందించవచ్చు.

## జకాత్ ఇచ్చే విషయంలో ఎవరికి ప్రాముఖ్యతనివ్వాలి?

పైన పేర్కొన్న ఎనిమిది మందిలో ఎవరికైనా జకాత్ ఇవ్వొచ్చు, కాని వారందరిలో ఈ క్రింది వారికి జకాత్ విషయంలో ప్రాధాన్యత ఇవ్వాలి:
1. దైవభీతిపరులు: దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఒక సందర్భములో ఇలా సెలవిచ్చారు: మీరు దైవభీతిపరుల సొమ్మే తినండి, దైవభీతిపరులకే తినిపించండి. అనగా ప్రతి ఒక్కరి ఆహ్వానాన్ని స్వీకరించకుండా దైవభీతిపరుల ఆహ్వానాన్ని స్వీకరించండి. దైవభీతి లేనివారు ఆ సొమ్మును ఎక్కడ నుండి సంపాదించారో, ధర్మసమ్మతమైన రీతిలోనే సంపాదించారో లేదో తెలియదు. కాబట్టి దానికి దూరంగా ఉండడం మంచిది. అలాగే మీరు దైవభీతికలవారికి సహాయము చేస్తే వారు దాన్ని మంచి కార్యాలకే ఖర్చుపెడతారు. దైవభీతి లేనివారికి ఇస్తే

దాన్ని నిషిద్ధమైన పనులలో కూడా ఖర్చుచేసే అవకాశము ఉంది. అల్లాహ్ తఆలా దివ్య ఖుర్ఆన్ లో ఈ విధంగా ఉపదేశించారు: మంచి పనులలో మీ వంతు సాయం చేయండి. చెడ్డ పనులు, పాపకార్యాలకు ఏమాత్రం సాయం చేయకండి. (ఇక్కడ దైవభీతి లేనివారికి జకాత్ ఇవ్వొద్దని అనడం లేదు. దైవభీతి గలవారికి ప్రాధాన్యత ఇవ్వడం శ్రేష్ఠమైనదని చెబుతున్నాము, అలాగే ఈ ఆదేశము అన్ని పరిస్థితులలో కాదు. కొన్ని సార్లు వారు ఎక్కువ కష్టాలలో ఉండొచ్చు, లేదా మన బంధువులు కావచ్చు. అలాంటప్పుడు వారికి సాయం చేయడమే శ్రేష్ఠమైనదిగా భావించాలి. కాని ఒక షరతు మీద, అదేమిటంటే ఎక్కువ శాతం వారు దాన్ని మద్యం సేవించడానికో లేదా ఇంకే ఇతర పాపకార్యానికో ఉపయోగించరని నమ్మకం ఉండాలి. అలా కాకుండా వారు దాన్ని పాపకార్యాలకే ఖర్చుపెడతారని తెలిస్తే వారికి సాయం చేయకూడదు.)

2. ధార్మిక విద్యను అభ్యసిస్తున్న లేదా బోధిస్తున్న పేద విద్యార్థులు/అధ్యాపకులకు ప్రాధాన్యత ఇవ్వాలి. ఎందుకంటే ఇందులో రెట్టింపు పుణ్యం లభిస్తుంది. ఒకటి పేదవారికి సాయం చేసినందుకు, రెండు ధార్మిక విద్యను అభ్యసించడంలో/బోధించడంలో తోడ్పడినందుకు.

3. బీదరికంతో పోరాడుతున్నప్పటికీ ఆత్మాభిమానం కారణంగా పరుల ముందు తమ అవసరాలను వ్యక్తం చేయనివారికి, సాయం చేయడంలో ప్రాధాన్యతనివ్వాలి. యాచననే వృత్తిగా చేసుకొని, ఇంటింటికి తిరిగి అడుక్కునేవారు అసలైన పేదవాళ్ళు కాదు. ఎన్ని అవసరాలు ఉన్నప్పటికీ, ఎన్ని బాధలు అనుభవిస్తున్నప్పటికీ ఆత్మాభిమానం కారణంగా పరుల ముందు యాచించని వారు కొందరు ఉంటారు. నిజానికి అసలు నిరుపేదలు వాళ్ళే. ఇలాంటి వారిని గుర్తించి వారికి సహాయ సహకారాలు అందించాలని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు బోధించారు. (బుఖారీ, ముస్లిం)

4. పనిచేసి అవసరాలకు సరిపడ డబ్బు సంపాదించుకోలేని వికలాంగులకు, ముసలివాళ్ళకు ప్రాధాన్యత ఇవ్వాలి.

5. ఆప్తులు, బంధువులకు అందరికంటే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. వీరికి సాయం చేయడంలో రెట్టింపు పుణ్యం ఉంది. అవసరాల్లో ఉన్నవారిని ఆదుకున్నందుకు, బాంధవ్యాలను నిలబెట్టినందుకు. అవసరాలలో ఉన్న బందువులను వదిలి ఇతరులకు దానాలు చేసే వాడి దానధర్మాలను అల్లాహ్ స్వీకరించడని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి సల్లమ్ గారు తెలిపారు.

## జకాత్ ఎవరికి ఇవ్వకూడదు?

1. ధనికులు: సంపన్నులకు, ఆరోగ్యవంతులకు జకాత్ ధర్మసమ్మతము కాదని దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు సెలవిచ్చారు. (తిర్మిజీ) సంపన్నులు, ఆరోగ్యవంతులు అంటే అన్న వస్త్రాలకు ఎలాంటి లోటులేని వారు, ఇతరుపై ఆధారపడే అవసరం లేనివారు అని విద్వాంసులు తెలిపారు.

2. సయ్యిద్ మరియు బనూహాషిమ్ లకు: అంటే, దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్

గారి వంశస్తులకు. దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఈ విధంగా సెలవిచ్చారు: “ఈ సదఖాలు (దానధర్మాలు) ప్రజల ధనసంపదల మాలిన్యం. కనుక ఇవి ముహమ్మద్‌కు, ముహమ్మద్ కుటుంబీకులకు ధర్మసమ్మతము కాదు.

3. జకాత్ చెల్లించే వ్యక్తి యొక్క ఉసూల్ మరియు ఫురూత్: అనగా అతడికి జన్మనిచ్చిన తల్లిదండ్రులు, అతడి తాత ముత్తాతలు అలాగే అతడి నుండి జన్మించిన కొడుకులూ, కూతుర్లు వారికి జన్మించిన పిల్లలు వీరెవ్వరికీ జకాత్ ఇవ్వకూడదు. వీరికి సేవ చేయడం అతని కర్తవ్యం, ఆ కర్తవ్యాన్ని జకాత్ డబ్బుతో నిర్వర్తించడం అంటే ఆ డబ్బును సొంత అవసరాలకు వాడుకునట్లే. కాబట్టి వారికి జకాత్ ఇవ్వలేరు.

4. భార్యాభర్తలు: వీరు ఒకరికొకరు జకాత్ ఇచ్చుకోవడం నిషేధితం.

5. అవిశ్వాసి: దాన ధర్మాలు చేయడంలో విశ్వాసి, అవిశ్వాసికి మధ్య ఎటువంటి బేధము లేదు. అందరికీ సహాయము చేయవచ్చు. దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి కాలంలో కొంత మంది సహాబా రజియల్లాహు అన్‌హుమ్ ఇస్లాం స్వీకరించినందుకు అవిశ్వాసులు మక్కాలో ఎంతో అన్యాయంగా, కఠినాతి కఠినంగా వారిపై దౌర్జన్యాలు చేసి వారిని మతం మార్చుకోవాలని బలవంతం చేసారని, అక్కడనుండి వలస వెళ్ళేంతగా బాధపెట్టారని మదీనాలో అవిశ్వాసులకు దానధర్మాలు చేయకుడదని, వారే నిస్సహాయులై ఇస్లాం సీకరిస్తారని అనుకున్నారు. అల్లాహ్ వారి ఈ నిర్ణయాన్ని ఖండించి వారికి దానధర్మాల విషయంలో విశ్వాసులకు, అవిశ్వాసులకు మధ్య బేధం చూపరాదని హితబోధ చేశారు. కాని జకాత్ అనేది ఓ ప్రత్యేకమైన విధిదానము. దీని నియమాలే వేరు. ఇది అందరు ఇచ్చేందుకు అర్హులు కారు, అందరికీ ఇచ్చేందుకు అనుమతి లేదు. చివరికి మసీదు లేదా మదరసా కట్టించడానికి కూడా జకాత్ ఇవ్వలేరు. కాబట్టి ఇందులో అవిశ్వాసుల ఒక వర్గానికి తప్ప ఇంకెవ్వరికీ ఇవ్వలేరు. (వారి గురించి సూరే తౌబా వచనము 60 లో చూడగలరు).

6. యుక్త వయసుకు చేరని ధనికుల పిల్లలకు కూడా జకాత్ ఇవ్వకూడదు.

## సదఖతుల్ ఫిత్ర్ (ఫిత్రా):

1. ఏ వ్యక్తి పై జకాత్ విధించబడిందో, లేదా జకాత్ విధించబడకపోయినా నిత్యవసరాల కన్నా అధికంగా ఉన్న వస్తువులు, ఆస్తిపాస్తులు, డబ్బులు మొత్తం కలిపి 52 1/2 తులాల వెండి విలువకు సమానంగా ఉంటే అతడు రమజాన్ పండుగ నాడు పేదలకు దానం ఇవ్వాలి. దీన్ని సద్‌ఖతుల్ ఫిత్ర్ అని (మన ప్రాంతాల్లో ఫిత్రా) అని అంటారు.

2. పండగ పూట నమాజు కోసం ఈద్‌గాహ్ కు వెళ్ళే ముందు ఫిత్రా ఇచ్చేయడం శ్రేష్ఠమైన, అభిలషనీయమైన కార్యం. ఒక వేళ నమాజుకు ముందు చెల్లించకపోతే నమాజు తరువాతైనా దాన్ని చెల్లించాలి.

3. ప్రతి ఒక్కరు తన తరఫున, యుక్త వయసుకు చేరుకోని తన పిల్లల తరఫున ఫిత్రా ఇవ్వాలి. కాని ఎవరైనా తన భార్య తరఫున, యుక్త వయసుకు చేరుకున్న తన పిల్లల తరఫున ఫిత్రా

ఇవ్వాలనుకున్నా అభ్యంతరం ఏమీ లేదు. వాళ్ళ తరఫున కూడా ఇవ్వొచ్చు.

4. రమజాన్‌లో ఉపవాసము ఉన్నవారు, అనివార్యమైన సమస్యల వల్ల ఉపవాసము లేనివారు అందరూ ఫిత్రా చెల్లించాలి.

5. 1 కిలో, 600 గ్రాముల గోధుమలు లేదా వాటి మూల్యం ఫిత్రాగా పేదలకు చెల్లించాలి.

6. ఒక వ్యక్తి తన ఫిత్రాను పలువురిలో పంచవచ్చు, అలాగే పలువురు కలిసి తమ ఫిత్రాలను ఒకే వ్యక్తికి దానం చేయవచ్చు.

7. జకాత్ తీసుకునేందుకు అర్హులైన ఎనిమిది మందే ఫిత్రా తీసుకునేందుకు కూడా అర్హులు.

## పండుగ రోజు దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు ఏమి చేసేవారు?

1. రమజాన్ మరియు బక్రీద్ పండుగలలో దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు గుసుల్ చేసేవారు (తలంటు పోసుకునేవారు).

2. తమ వద్ద ఉన్న మంచి దుస్తులను ధరించేవారు.

3. రమజాన్ పండుగ నమాజుకు వెళ్ళే ముందు బేసు సంఖ్యలో (3, 5, 7...) కర్జూరాలు తినేవారు.

4. బక్రీద్ పండుగ రోజు ఏమీ తినకుండా నమాజుకు వెళ్ళేవారు. నమాజు నుండి తిరిగొచ్చాక ఖుర్బానీ చేసి ముందుగా దాని మాంసాన్ని భుజించేవారు.

5. పండుగ నమాజు ఈద్‌గాహ్‌కు వెళ్ళి చేసేవారు.

6. ప్రవక్త మహనీయులు సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి మసీదులో ఒక్క నమాజు చేస్తే ఇతర మసీదులలో 50,000 నమాజులకు సమానమైన పుణ్యం లభిస్తుంది. కాని అంతటి శ్రేష్ఠమైన, ఉత్తమమైన మసీదును వదిలి దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ వారు ఈద్‌గాహ్ లో పండుగ నమాజు చేసేవారు. దీని ద్వారా పండుగ నమాజు ఈద్‌గాహ్‌లో చేయడం శ్రేష్ఠమైనదని తెలుస్తుంది.

7. తక్బీర్ “అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ లా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వలిల్లాహిల్ హంద్” చెబుతూ ఈద్‌గాహ్ కు వెళ్ళేవారు.

9. రమజాన్ పండుగ నమాజు కొంత ఆలస్యంగా, బక్రీద్ పండుగ నమాజు కాస్త త్వరగా (అనగా సూర్యోదయంతోనే) చదివేవారు.

10. ఈద్‌గాహ్ చేరగానే అజాన్, ఇఖామత్ లేదా నమాజు ప్రారంభము కానున్నదని ప్రకటించకుండానే నమాజు ఆరంభించేసేవారు.

11. ఈద్‌గాహ్‌కు చేరుకున్నాక ఎటువంటి నఫిల్ నమాజులు చేసేవారు కాదు.

12. ముందు నమాజు చదివించి ఆ తరువాత ఖుత్‌బా ఇచ్చేవారు.

13. ఖుత్‌బా ఇచ్చేటప్పుడు వారు ప్రజల వైపుకు తిరిగి నిలబడేవారు, అందరూ పంక్తులలోనే కూర్చొని ఖుత్‌బా వినేవారు.

14. ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు, వెళ్ళిన దారిన తిరిగి రాకుండా వేరే దారిలో వచ్చేవారు.

పాఠకుల కోరికపై చివర్లో తరావీహ్ నమాజుకు సంబంధించిన ఓ అంశం మీది ఒక సంక్షిప్త వ్యాసం రాయబడుతుంది.

## తరావీహ్ నమాజు రకాతుల సంఖ్య:

ప్రియ పాఠకులారా ! పవిత్ర రమజాన్ మాసము ఆరంభమైన మరుక్షణమే అదృష్టవంతులైన ముస్లిం సోదరులు, దైవకారుణ్యం; దైవ ప్రసన్నత కొరకు ఆరాటపడుతూ అల్లాహ్ తఆలా యొక్క ఆరాధనలో నిమగ్నమైపోతారు. స్వయంగా మన ప్రియ ప్రవక్త హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వసల్లమ్ వారు కూడా రమజాన్ మాసములో నడుము బిగించి ఇతర మాసాల కంటే ఎక్కువగా దైవారాధనకి తమని తాము అంకితం చేసుకునేవారు. మన సలఫ్ సాలిహీన్ (అనగా సహాబా, తాబయీన్, తబేతాబయీన్ అందరూ) కూడా ఇతర మాసాల కన్నా రమజాన్ లో దానధర్మాలు, నమాజులు, ఖుర్ఆన్ పారాయణం ఎక్కువగా చేసేవారు. ఇమామ్ బుఖారీ రహ్మతుల్లాహి అలైహ్ గారు రమజాన్ మాసంలో 61 సార్లు పూర్తి ఖుర్ఆన్ పారాయణం చేసేవారు. (హదియుస్సారీ) ఒక సాధారణ ముస్లిం కూడా ఈ నెలలో ఉపవాసము, ఫరజ్ మరియు సున్నత్ నమాజులతో పాటు 20 రకాతులు తరావీహ్ నమాజు ఎంతో ఆశక్తితో చేస్తాడు. కాని కొందరు, రమజాన్ ఆరంభము నుండే తెహ్కీక్, తక్లీద్ అంటూ; అసలు తరావీహ్ నమాజే లేదు, అది తహజ్జుద్ నమాజు, అది కూడా 20 రకాతులు కాదు 8 రకాతులు మాత్రమే, మక్కా మదీనాలలోనూ 8 రకాతులు మాత్రమే చదువుతారంటూ అబద్ధలు చెబుతూ తమతో పాటు ఇతరుల ఆరాధనలను కూడా మట్టికల్పిచడం ఆరంభిస్తారు. ఎన్నడూ వినని వింత వింత మాటలు చెబుతూ జనాన్ని తికమక పెడుతుంటారు. కొంత కాలం వరకు వీరి అబద్ధాలకు అందరూ ఆకర్షితులయ్యారు. కాని టెక్నాలజీ పెరగడం వల్ల మక్కా మరియు మదీనా నగరాలలో జరిగే తరావీహ్ నమాజను లైవ్‌గా చూసి ప్రజలు వీరి అబద్ధాలను తెలుసుకున్నారు. చివరికి మదీనా ఇస్లామిక్ యూనివర్సిటీ అధ్యాపకులు, మదీనా నగరపు కాజీగా సేవలు అందించిన ప్రముఖ విద్వాంసులు అతియ్యాహ్ ఇబ్నే ముహమ్మద్ సాలిమ్ (జననం 1927– మరణం: 1999) గారు రాసిన పుస్తకం “అత్ తరావీహ్ అక్సరు మిన్ అల్ఫి ఆమ్మిన్ ఫిల్ మస్జిదిన్ నబవీ” (తరావీహ్ నమాజు దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి మసీదులో 1000 సంవత్సరాలకు పైగా) ప్రచురించబడ్డ తరువాత వీరి ఈ అబద్ధానికి తెరపడింది. ఇందులో వారు దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి కాలం నుండి ఇవాల్టి వరకు మదీనాలో తరావీహ్ నమాజు ఎలా జరిగేదో క్లుప్తంగా రాశారు. దైవ ప్రవక్త గారి కాలంలో ముందు 4 రకాతులు ఆ తరువాత 8 రకాతులతో మొదలై 20 రకాతుల వరకు చేరిందని, ఆ తరువాత సహాబా రజియల్లాహు అన్హుమ్ గారి కాలం నుండి 20 రకాతులే కొనసాగుతూ వచ్చాయని, ఆ తరువాత ఏ ధశాబ్దము లోను 20 రకాతులకు తక్కువ ఎప్పుడూ జరుగలేదని వారు నిరూపించారు. పాఠకులు ఇకపై వారి మాటల వలలో చిక్కుకొని అపోహలకు గురికాకూడదని, ముందే వారి మాటలు విని ఆందోళన చెందుతున్న వారి సందేహాలు దూరం కావాలని ఇక్కడ తరావీహ్

నమాజు 20 రకాతులు అని నిరూపిస్తూ కొన్ని హదీసులను రాయడం జరుగుతుంది.

## దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారు 20 రకాతులు చదివారు:

హజ్రత్ అబ్దుల్లాహ్ ఇబ్నే అబ్బాస్ రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనం ప్రకారం దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహివసల్లమ్ గారు రమజాన్‌లో 20 రకాతులు తరావీహ్ మరియు 3 రకాతులు వితర్ నమాజు చేసేవారు. (ముసన్నఫ్ ఇబ్నే అబీ షైబహ్: 225/5; హదీస్: 7774). ఈ హదీసు హసన్ అని నిర్ధారించడం జరిగింది. (వివరాల కొరకు చూడండి అహ్‌సనుత్ తన్‌కీహ్ లి అదది రకాఅతిత్ తరావీహ్)

## సహాబా రజియల్లాహు అన్హుమ్ గారి కాలంలోనూ 20 రకాతులు:

హజ్రత్ సాయిబ్ ఇబ్నే యజీద్ రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ ఉమర్ రజియల్లాహు అన్హు గారి పరిపాలనలో 20 రకాతులు తరావీహ్ మరియు 3 రకాతులు వితర్ నమాజు చేసేవారు. (మారిఫతుస్ సునని వల్ ఆసార్: 540/9) ఈ ఉల్లేఖనం యొక్క సనద్ సహీహ్ అని ఇమామ్ సుబ్‌కీ రహ్మతుల్లాహి అలైహ్ గారు “షరహ్ మిన్‌హాజ్” లో, ముల్లా అలీ ఖారీ రహ్మతుల్లాహి అలైహ్ గారు “షరహ్ ముఅత్తా”లో ఘోషించారు. ఈమామ్ గజాలీ రహ్మతుల్లాహి అలైహ్ గారు కూడా దీని సనద్‌ను సహీహ్ అని అన్నారు. (షరహ్ అత్ తక్‌రీబ్: 97/3).

హజ్రత్ సాయబ్ ఇబ్నే యజీద్ గారి ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ ఉమర్ మరియు హజ్రత్ ఉస్మాన్ రజియల్లాహు అన్హుమా గారి కాలంలో 20 రకాతులు తరావీహ్ చదివేవారు. ఇమామ్ 100 పైచిలుకు వచనాలు ఉన్న పెద్ద పెద్ద సూరాలను చదివించడం వల్ల ప్రజలు నిలువలేక కర్రల సాయంతో నిలబడేవారు. (సుననుల్ కుబ్రా: 499/2 హదీస్: 4617) అల్లామహ్ నవవీ రహ్మతుల్లాహి అలైహ్ గారు “ఖులాసతుల్ అహ్‌కామ్: 576/1 లో, ఇబ్నే ఇరాకీ రహ్మతుల్లాహి అలైహ్ గారు షరహ్ అత్ తక్‌రీబ్: 97/3 లో ఇమామ్ సుయూతీ రహ్మతుల్లాహి అలైహ్ గారు “అల్ మసాబీహ్” లో, ముహద్దిస్ షౌక్ నీమవీ గారు ఆసారుస్ సునన్: 394/2 లో ఈ హదీసును సహీహ్ అని నిర్ధారించారు. రకాతుత్ తరావీహ్ ఏక్ తెహ్‌కీకీ జాయిజా అనే ఉర్దూ పుస్తకంలోని 81 వ పేజీలో అహ్లే హదీస్ వర్గానికి చెందిన మౌల్వీ అయ్యూబ్ సాబిర్ ఈ హదీసును సహీహ్ అని ధృవీకరిస్తూ “దీని సనద్ లో ఎటువంటి లోపము లేదు” అని అన్నట్లు వ్రాయబడింది.

యహ్‌యా బిన్ సయీద్ గారి కథనం ప్రకారం హజ్రత్ ఉమర్ రజియల్లాహు అన్హు గారు ఒక వ్యక్తికి తరావీహ్ నమాజు 20 రకాతులు చేయించమని ఆజ్ఞాపించారు. (ముసన్నఫ్ ఇబ్నే అబీ షైబహ్: 5/223) ఈ ఉల్లేఖనం యొక్క సనద్ ముర్‌సల్ సహీహ్ అని ఆసారుస్ సునన్: 396/2 లో తెలుపడం జరిగింది.

యజీద్ బిన్ రోమాన్ గారి కథనం ప్రకారం హజ్రత్ ఉమర్ రజియల్లాహు అన్హు గారి కాలంలో ప్రజలు (సహాబా, తాబయీన్‌లు) 23 రకాతులు (20 తరావీహ్, 3 వితర్) చదివేవారు.

(ముఅత్తా ఇమామ్ మాలిక్: 98) ఈ రివాయత్ కూడా ముర్సల్ సహీహ్ (ఆసారుస్సునన్: 2/396).

హజ్రత్ హసన్ రహ్మతుల్లాహి అలైహ్ గారి ఉల్లేఖనం ప్రకారం హజ్రత్ ఉమర్ రజియల్లాహు అన్హు గారు ప్రజలను హజ్రత్ ఉబై బిన్ కాబ్ రజియల్లాహు అన్హు గారి నేతృత్వంలో తరావీహ్ చదవమని ఆదేశించారు. ఉబై బిన్ కాబ్ రజియల్లాహు అన్హు గారు వారికి 20 రకాతులు తరావీహ్ నమాజు చేయించే వారు. (అబూదావూద్: 211; హదీస్: 1429)

పవిత్ర రమజాన్ మాసంలో హజ్రత్ అలీ రజియల్లాహు అన్హు గారు ఖుర్ఆన్ బాగా పఠించేవారిని పిల్పించి వారిలో ఒకరికి 20 రకాతులు తరావీహ్ నమాజు చేయించమని ఆజ్ఞాపించారు. మరియు తరావీహ్ తరువాత హజ్రత్ అలీ రజియల్లాహు అన్హు గారే స్వయంగా వారికి 3 రకాతులు వితర్ నమాజు చేయించేవారు. (సుననుల్ కుబ్రా: 2/699; హదీస్: 462)

ప్రముఖ హదీసు గ్రంథమైన తిర్మిజీలో ఇమామ్ తిర్మిజీ రహ్మతుల్లాహి అలైహ్ గారు ఇలా వ్రాసారు: "హజ్రత్ ఉమర్, హజ్రత్ అలీ మరియు ఇతర సహాబా రజియల్లాహు అన్హుమ్ నుండి ఉల్లేఖించబడినట్లుగా తరావీహ్ నమాజు యొక్క రకాతుల సంఖ్య ఇరవయ్యేనన్నది ధార్మిక విధ్వాంసులలో అధిక శాతం మంది యొక్క అభిప్రాయము. హజ్రత్ సుఫియాన్ సౌరీ, ఇబ్నే ముబారక్ మరియు ఇమామ్ షాఫయీ రహ్మతుల్లాహి అలైహిమ్‌ల అభిప్రాయము కూడా ఇదే. ఇమామ్ షాఫయీ రహ్మతుల్లాహి అలైహ్ గారు "నేను నా ప్రాంతమైన మక్కా నగరములో 20 రకాతులు తరావీహ్ నమాజు చేస్తారని అన్నారు." (తిర్మిజీ: 166/1) అల్‌హందులిల్లాహ్ మక్కా నగరానికి చెందిన ఇమామ్ షాఫయీ రహ్మతుల్లాహి అలైహ్ గారు సాక్షమిచ్చినట్లు వారి కాలము లోనూ, వారి కంటే ముందు సహాబా మరియు తాబయీన్‌ల కాలం లోనూ 20 రాకాతులు తరావీహ్ చేసేవారు. ఆ నాటి నుండి నేటి వరకు కూడా అదే సైలిలో 20 రకాతులు ప్రతి రోజు మక్కా మరియు మదీనా నగరాలలో చేస్తూవచ్చారు. హజ్రత్ ఉమర్, హజ్రత్ ఉస్మాన్, హజ్రత్ అలీ రజియల్లాహు అన్హుమ్ కాకుండా ఇంకా ఎంతో మంది ప్రముఖ సహాబీలు కూడా 20 రకాతులు తరావీహ్ నమాజు చేసేవారని ఎన్నో ఉల్లేఖనాలు సాక్షమిస్తున్నాయి. (వివరాల కోసం నమాజే పయంబరీ (ఉర్దూ) మరియు ఖుర్ఆన్, హదీస్ మరియు అహ్లే హదీసు ధర్మము (తెలుగు) తదితర పుస్తకాలను చూడగలరు).

ఈ ఉల్లేఖనలు చూసిన తరువాత ఇక ఎటువంటి సమదేహము, సంకోచము మిగిలి ఉండదని భావిస్తున్నాను. కాని ఈ విషయం మరింత బలంగా మనసులో కూరుకుపోవాలని ప్రముఖ ధార్మిక విద్వాంసులైన ఇమామ్ ఇబ్నే తైమియహ్, ఇబ్నే కుదామహ్, ఇమామ్ నవవీ, అబ్దుల్ వహ్హాబ్ నజ్దీ రహ్మతుల్లాహి అలైహ్ గార్ల ఫత్వాలను మీ ముందు ఉంచదలిచాను.

ఇమామ్ ఇబ్నే తైమియహ్ రహ్మతుల్లాహి అలైహ్ గారి ఫతాఫా యొక్క 23 వ సంపుటి 68 వ పేజీ లో వారి ఫత్వా ఈ విధంగా వ్రాయబడి ఉంది: "హజ్రత్ ఉబై ఇబ్నే కాబ్ రజియల్లాహు అన్హు గారు సహాబా (దైవ ప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లమ్ గారి శిష్యులు), తాబయీన్‌లకు 20 రకాతులు తరావీహ్ మరియు 3 రకాతులు వితర్ నమాజు చేయించేవారని నిర్ధారించబడింది.

(ఇందులో ఇక ఎటు వంటి సంకోచము లేదు) అందుచేతనే అధిక శాతం విద్వాంసుల అభిప్రాయం ప్రకారం ఇదే (అనగా 20 రకాతులు చదవడమే) సున్నత్. ఎందుకంటే ముహాజిరీన్ మరియు అన్సార్‌లలో నుండి ఏ ఒక్కరు కూడా దీనిపై అభ్యంతరం వ్యక్తం చేయలేదు.

అల్ అజ్కార్: 242 లో ఇమామ్ నవవీ రహ్మతుల్లాహి అలైహ్ గారు ఇలా అన్నారు: తెలుసుకోండి ! ధార్మిక విద్వాంసులందరి సమగ్ర నిర్ణయం ప్రకారం తరావీహ్ నమాజు సున్నత్, తరావీహ్ నమాజు 20 రకాతులు, ప్రతి రెండు రకాతుల తరువాత సలామ్ చేస్తూ ఈ నమాజు సలుపబడుతుంది.

ఇబ్నే కుదామా రహ్మతుల్లాహి అలైహ్ గారు అల్ ముగ్నా: 139/2 లో ఇలా వ్రాసారు: ఇమామ్ ఆహ్మద్ ఇబ్నే హంబల్ రహ్మతుల్లాహి అలైహ్ గారి ప్రకారం 20 రకాతులు చదవడమే అభిలషనీయం. ఇమామ్ సుఫియాన్ సౌరీ రహ్మతుల్లాహి అలైహ్ గారి అభిప్రాయము కూడా ఇదే. వారి తార్కికము ఏమిటంటే హ్రజత్ ఉమర్ రజియల్లాహు అన్హు గారు హ్రజత్ ఉబై ఇబ్నే కాబ్ రజియల్లాహు అన్హు గారిని ఇమామ్‌గా నియమించినప్పుడు వారు 20 రకాతులు చేయించేవారు. ఇమామ్ అహ్మద్ రహ్మతుల్లాహి అలైహ్ గారు హ్రజత్ యజీద్ మరియు హ్రజత్ అలీ రజియల్లాహు అన్హు గారి ఉల్లేఖనాల ఆధంరంగానూ ఈ నిర్ణయానికి వచ్చారు. ఎందుకంటి ఈ ఉల్లేఖనాల ద్వారా తరావీహ్ నమాజు 20 రకాతులు కావడం పే సహాబా (దైవ ప్రవక్త శిష్యులు) అందరూ ఏకీభవించినట్లు, ఈ విషయంలో ఎవరికీ భిన్నాభిప్రయము లేనట్లు స్పష్టమౌతుంది. మరి ఏ విషయము పై సహాబాలందరూ ఏకీభవించారో, సమ్మతించారో అదే అనురించదగినది.

అలాగే ముహమ్మద్ బిన్ అబ్దుల్ వహ్హాబ్ నజ్దీ రహ్మతుల్లాహి అలైహ్ గారిని తరావీహ్ నమాజు యొక్క రకాతుల సంఖ్యను గూర్చి ప్రశ్నించగా వారు 20 రకాతులు చదవడం అభిలషనీయం అని సమాధానమిచ్చారు. వీటన్నిటి ద్వారా మనకు ఈ విషయంలో ఒక స్పష్టత అనేది వచ్చిందని ఆశిస్తున్నాను.

---

Printed, published and owned by Mohd Abdul Qavi,
17-1-391/M/13, Khaja Bagh, Saidabad colony,
Hyderabad-59.
Published from Idara Ashraful Uloom Trust,
17-1-391/M/13, Khaja Bagh, Saidabad, Hyderabad-59.
Printed at printline printers,
3-6-753/1, Himayath Nagar, Hyderabad-29.
Editor; Mohammed Omar Farooq.